శ్రీ శంకర భగవత్పాద విరచిత

# మోహముద్గరః

## "ప్రబోధ రత్నావళి"

(ఆంధ్ర వ్యాఖ్యాన సహితము)

వ్యాఖ్యాత :

**భాగవతి రామమోహనరావు**



ప్రకాశకులు :

**జ్ఞానవికాస్ పబ్లికేషన్సు**

**210-3 ఆర్. టి. విజయనగర్ కాలనీ, హైదరాబాదు.**

**1989**

# పురోజీ

ముముక్షువుల హితార్థం, శంకర భగవత్పాదులు ప్రసాదిం చిన వేదాంత సాహిత్య సృష్టిలో ఈ "మోహముద్గరః"లోని భజ గోవింద శ్లోకాలను ఎంతో అమూల్యమైనవిగా పరిగణిస్తూ పఠిస్తూం టారు. వివేక వైరాగ్యాల్ని జనింపజేస్తూ, అజ్ఞానాన్ని అరికట్టి, ఆత్మానుభూతికి దోహదం చేసే ఈ పవిత్ర శ్లోకాలలోని ప్రబో ధాలు ఎంతో విలువైన రత్నాల్లా విరాజిల్లుతూంటాయి. అందుకే, ఆంధ్ర వ్యాఖ్యాన సహితమైన ఈ గ్రంథానికి "ప్రబోధరత్నావళి" అనే పేరు కూడా, సార్థక నామధేయమని, పెట్టబడింది.

ఆత్మజిజ్ఞాసులకు వివేకవైరాగ్యాలు ఎంత ఆవశ్యకమో శంకర భగవత్పాదులు వివేకచూడామణిలో ఇలా వివరించారు:-

వైరాగ్య బోధౌ పురుషస్య పక్షివత్
పక్షౌ విజానీహి విచక్షణత్వం।
విముక్తి సౌధాగ్ర లతా ధిరోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిధ్యతి॥ (వి.చూ. 374)

అంటే, ఆకాశంలో ఎగరడానికి పక్షికి రెండు రెక్కలు ఎలా అవ సరమో, అలాగే మనిషికి ముక్తిపథాన్ని చేరడానికి, విషయవైరా గ్యము, వివేకజ్ఞానము అత్యంత ఆవశ్యకం. ఈ రెండింటిలో ఏది లోపించినా సాధన అంతా విఫలమే అవుతుంది కదా.

ఆత్మజిజ్ఞాసుల ఉపయోగార్థం జ్ఞానవికాస్ పబ్లికేషన్స్ వారిచే ఇదివరలో "జ్ఞానప్రభ", "ఆదిశంకరుల ఆత్మబోధ" అనే

రెండు ఆధ్యాత్మిక గ్రంధాలు ప్రచురించబడినాయి. ఇది మూడవది. ఈ గ్రంధాలలోని అంశాలను అవగాహన చేసుకుని మననం చేస్తే, జ్ఞానంతోకూడిన అనుష్టానం చెయ్యడం సులభ సాధ్యమౌతుందని నమ్మకం కలుగుతుంది. జ్ఞానంతో చేసే అనుష్టానమే ఉత్తమమైన ఆధ్యాత్మిక సాధన అవుతుందని, జ్ఞానంలేని అనుష్టానం అధమమని, జ్ఞానం పొంది అనుష్టానం లేకపోవడం మధ్యమమని వేదాంత శాస్త్రాల్లో సూచింపబడింది. ఇక్కడ జ్ఞానమంటే వేదాంత శాస్త్ర జ్ఞానమని అర్థం చేసుకోవాలి. ముందు శాస్త్రజ్ఞానం ద్వారా తత్వ నిర్ధారణ చేసుకుని, భగత్తత్వాన్ని వివేకంతో గ్రహించుకున్న అనంతరం, ఆధ్యాత్మిక అనుష్టానాన్ని ఆచరించడం ఉత్తమమైన సాధనగా సూచింపబడింది.

ఈ గ్రంధంలోని శ్లోకాలను, ఆధ్యాత్మిక అంశాలను, ముముక్షువులు ప్రతినిత్యం మననం చేసుకోవలసిన పరమోత్కృష్టమైనవని భావిస్తూ, పఠిస్తూండాలని ప్రకాశకుల ఆకాంక్ష. ఈ శ్లోకాలకి వ్యాఖ్యానం శాస్త్రాధారమైన, ఎంతో విలువైన ఆధ్యాత్మిక సత్యాలను ప్రదర్శిస్తూ సమర్పింపబడింది. ఇలాంటి పవిత్ర గ్రంధాన్ని మననం చేస్తూ, యదార్ధమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని గ్రహించుకుని, సక్రమమైన అనుష్టానం చేస్తూ, ఆత్మానుభూతిని పొందడమే మానవజన్మకి కర్తవ్యమని శంకర భగవత్పాదుల ప్రబోధాలలోని సారాంశం.

హైదరాబాద్, ఇట్లు
తేది. 1-10-1989 ప్రకాశకులు.

# తత్వ సంగ్రహం

అమూల్యమైన మానవ జీవితాన్ని సార్ధకం చేసుకునేందుకు చిత్తశుద్ధితో భగవద్ధ్యానం చేసుకోమని గురువులు, స్వాములు మఠాధిపతులు మొదలైన ప్రవక్తలు వారి వారి ప్రవచనాలలో, ఉపదేశాలలో బోధిస్తూంటారు. వినేవారిలో ఇంచుమించు ఎవరికీ భగవంతుడెవరో తెలియనే తెలియదు. దేనిని ధ్యానం చెయ్యాలో, ఏది భగవద్ధ్యాన మవుతుందో, భగవంతుడెవరో తెలియని వారికి ఎలా గ్రాహ్యమౌతుంది? యదార్థమైన భగవత్తత్త్వాన్ని గురించి, నిశ్చయమైన, నిస్సంశయమైన శాస్త్రజ్ఞానం లేకపోవడం వల్ల, అనేక కార్యక్రమాలు, ఆధ్యాత్మిక అనుష్టానాలనుకుంటూ, దేశ వ్యాప్తంగా ఆచరింపబడుతున్నాయి.

భగవత్తత్వం యేదో ముందర వివరంగా విశదపరచి, తరువాత భగవద్ధ్యానం చేసుకోమని ఆదేశించడం, సరియైన అధ్యాత్మిక బోధ అవుతుంది. యదార్థమైన భగవత్తత్వాన్ని నిస్సందేహంగా అవగాహన చేసుకుని, తరువాత ధ్యానానుష్టానికి ఉపక్రమించడం సక్రమమైన ఆధ్యాత్మిక సాధన అయి ఫలవంతమౌతుంది. అయితే, ఆ భగవత్తత్వాన్ని గురించి సవ్యంగా, సరళంగా, సంశయ రహితంగా, సాధన సాధ్యంగా బోధించడం ఎవరికి సాధ్యమౌతుంది? సాధన సంపన్నులైన ఆత్మానుభవజ్ఞులకు,

ఆధ్యాత్మిక తత్వవేత్తలైన మహనీయులకు మాత్రమే అది సాధ్యమౌతుంది. సాధన సంపత్తితో ఆత్మానుభూతిని పొందక, శాస్త్ర పఠనం వల్ల పాండిత్య ప్రతిభను మాత్రం గడించిన పండితులకు అది సంభవం కాదు. కఠోపనిషత్తులో దీన్ని గురించి యమధర్మరాజు నచికేతునికి ఈ విధంగా విశదపరిచాడు :-

న వరేణా వరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః
అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి
అణీయాన్ హ్యతర్క్య మణుప్రమాణాత్ ॥

అంటే, ఆత్మానుభవజ్ఞులు తప్ప ఇతర వ్యక్తులెవరూ (ఎంత పండితులైనా) ఆత్మ తత్వాన్ని ఉపదేశించుటకు అర్హులు కాజాలరు. అర్హతలేని మనుష్యులచేత చేయబడే ఉపదేశాలు, బోధలు, నిష్ప్రయోజనాలై, వాటివల్ల ఉపదేశికులకు ఆత్మతత్వం ఎంతమాత్రం అవగాహన అవదు. బ్రహ్మజ్ఞానియైన మహనీయుని ఉపదేశం నిస్సంశయంగా ఆత్మతత్వాన్ని విశదపరుస్తుంది. ఆ తత్వం అతి సూక్ష్మాతి సూక్ష్మమైనది కనుక, అది కేవలం తర్కంవల్ల కాని ఊహలచేతగాని గ్రహింపబడేది కాదు.

భగవంతుడెవరో తమకు అన్యుడని భావిస్తూ వానిని పూజించాలనీ, సేవించాలనీ, సాధించాలనీ అనుకుంటారు. అది సరియైన ఆధ్యాత్మిక భావం ఎలా అవుతుంది? అదంతా ద్వైతభూయిష్టమై అహంకారపరమైన అవివేకమే అవుతుంది. పరమాత్మ తనకంటె వేరని భావించడం అసలైన ఆధ్యాత్మికం అవదు. ఇలాంటి భావాలు

సర్వోత్కృష్టమైన మన వేదాంత సిద్ధాంతానికి అనుగుణ్యమైనవి కావాలవు. భగవద్భక్తి అంటే స్వస్వరూపానుసంధానమని మన వేదాంతశాస్త్రాల్లో విపులంగా వివరించబడింది. భక్తిని గురించి వివేకచూడామణిలో ఏ విధంగా చెప్పబడిందో ఈ క్రింది శ్లోకం చూస్తే విదితమౌతుంది :-

మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥

(వి చూ. 32)

అంటే, ముక్తికోసం చేసే సాధనల్లో, భక్తి ఎంతో శ్రేష్ఠమైంది. భక్తి అంటే స్వస్వరూపానుసంధానం.

ఈ శ్లోకంలో వ్యక్తపరచిన పరమోత్కృష్టమైన ఆధ్యాత్మిక సత్యానికి అనుగుణంగా, స్వస్వరూపాన్ని (ఆత్మని) గురించి చేసే అనుసంధానమే యదార్థమైన ఆధ్యాత్మిక అనుష్ఠానం అవుతుంది. అదే భక్తి. అంటే దేహాత్మభావాన్ని విస్మరిస్తూ, తన నిజస్వరూపంలో (ఆత్మానుసంధానపరుడై) ఉండటమే స్వరూపస్థితి. జ్ఞానమన్నా, యోగమన్నా ఇదే.

"అహం బ్రహ్మాస్మి", "తత్వమసి", "అయమాత్మా బ్రహ్మ" మొదలైన మహావాక్యాలు మనమే భగవత్స్వరూపులమై యున్నామన్న మహత్తర తత్వాన్ని బోధిస్తున్నాయి. భగవంతుడు మనకన్యుడెవరో కాదనీ, స్వయంగా మనం భగవత్స్వరూపులమే ననీ వాటి సారాంశం. కనుక, భగవంతుని కోసం అన్వేషించడం

తనను తాను అన్వేషించుకోవడమే అవుతుంది. ఏ భగవంతుని పొందాలని ఆక్రోశిస్తున్నారో ఆ భగవత్ స్వరూపం తమ యదార్థ స్వరూపమే అయి వుంది. అజ్ఞానంవల్ల ఇంద్రియాలకు గోచరించే శరీర ప్రపంచాదులన్నీ అసత్యమైన, స్వప్నసమానమైన మిధ్యాస్వరూపాలనీ, యదార్థంగా ఉన్నదంతా బ్రహ్మస్వరూపము యొక్కటేననీ సర్వోత్కృష్టమైన మన వేదాంత శాస్త్రాలు విశదపరుస్తున్నాయి. ఈ పరమాద్వైత సత్యం పటిష్టమైన ఆధ్యాత్మిక పునాదులమీద ప్రతిష్టింపబడింది.

మన వేదాంత శాస్త్రాల్లో వివరింపబడిన భగవత్తత్త్వాన్ని ఒక్కసారి మననం చేసుకుంటే, సంశయాలు, అపోహలు పటాపంచలైపోతాయి. యదార్థమైన భగవత్తత్త్వం ఏదో గ్రాహ్యమవుతుంది.

తెలియబడే దృశ్యజాతమంతా అనాత్మ అని మన వేదాంత శాస్త్రాలు స్పష్టపరిచాయి. అంటే, తెలియబడేవన్నీ నిజంగా లేనటువంటి మిధ్యాస్వరూపాలు. సూక్ష్మంగా చెబితే, వినేవి, తాకేవి, చూసేవి, తినేవి, ఘ్రాణించేవి, గ్రహించేవి, పని చేసేవి- ఇలాంటివన్నీ తెలియబడేవి. ఇవి శరీరానికీ, ప్రపంచానికీ సంబంధించినవి. అయితే, ఇవన్నీ ఎల్లప్పుడూ తెలియబడేవి కావు. అందుకే వీటిని మిథ్యాస్వరూపాలనీ, నిజంగా లేనివేననీ ధృవపరిచారు.

ప్రతి నిత్యం, మన మనుగడ మూడు అవస్థలతో సాగుతూంటుంది. మెలకువ అనబడే జాగ్రదావస్థ, కలలు కంటూండే స్వప్నావస్థ, నిద్రానుభవంలో గడిపే సుషుప్తావస్థ. ఎప్పుడైతే

నిద్రానంతరం, మెళకువ అనబడే జాగ్రదావస్థలో ప్రవేశిస్తామో, అప్పుడే మిథ్యాస్వరూపాలైన అనాత్మ పదార్థాలన్నీ తెలియబడుతూంటాయి. జాగ్రదావస్థలోకి రాగానే ముందర అహంకారం స్ఫురించి, తరువాత శరీరం, ప్రపంచం గోచరిస్తాయి. స్థూల శరీరానికి ప్రతినిధిగా ఆవిర్భవించిన "నేను" అనే అసత్యపు భ్రాంతి భావమే అహంకారం. ఇది దేహాత్మబుద్ధితో బహిర్ముఖియై, ఇంద్రియాల ద్వారా భాసించే ప్రపంచాన్నీ, విషయాల్నీ తెలుసుకుంటుంది. సమస్త కర్తృత్వ భోక్తృత్వ కార్యకలాపాల్నీ నిర్వహిస్తూంటుంది. దీనిని శాస్త్రకారులు వైశ్వానరుడంటారు. నిద్రిస్తూంటే స్వప్నాలు కలుగుతూంటాయి. అప్పుడు దేహాత్మభావం కాని, అహంకారత్వం కాని తెలియబడక, మనస్సొక్కటే పని చేస్తూంటుంది. ఈ స్వప్నావస్థలో జాగ్రదావస్థలోని వేవీ తెలియబడవు. కొత్త విషయాలు గోచరిస్తూంటాయి. ఇలా ఆ స్వాప్నిక విషయాలను- స్వప్నావస్థలో గ్రహిస్తూండే దానిని- తైజసుడంటారు. ఇక సుషుప్తి అనబడే గాఢ నిద్రావస్థలో ఇవేవీ అసలు తెలియబడవు. అన్ని విషయాలు, అనుభవాలు అదృశ్యమై ఒక సూక్ష్మమైన చైతన్యం మాత్రం ఉంటుంది. ఎరుకగాని, స్మృతిగాని, ఎలాంటి మనోవికారంగాని లేక ప్రశాంతంగా ఉండిపోతుంది. ఇలా సుషుప్తావస్థలో ఉండే దానిని ప్రాజ్ఞుడంటారు. ప్రతి నిత్యం, యీ మూడవస్థల్లో ఉంటూ, వైశ్వానరుడని, తైజసుడని, ప్రాజ్ఞుడని, అవస్థాభేధాన్ని బట్టి పిలువబడుతూ, మనుగడ సాగించే అహంకార ప్రకృతియే జీవుడని అనబడుతున్నది.

"శరీరమే నేను" అనుకొనే అహంకార భావమే జీవత్వం. అహంకార భావోత్పత్తి వల్లనే, తెలుసుకునేవాడు, తెలివి, తెలియబడేది, అనే మూడూ ఉద్భవిస్తున్నవి. వీనినే ద్రష్ట, దృక్కు, దృశ్యం అంటారు. సూక్ష్మంగా విచారిస్తే, యీ "నేను నేన"ని భాసిస్తూండే అహంకారం నిజంగా శరీరానికి ఎలా చెందుతుంది? శరీరం పట్టి జడపదార్థ నిర్మాణం. దానిలో ఎంత వెదికి చూసినా, చర్మం, మాంసం, రక్తం, ఎముకలు, నరాలు లాంటి జడపదార్థాలే తప్ప "నేను" అనేదెక్కడా కనిపించదు. ఇలాంటి శరీరానికి అహంకార బుద్ధి కలగడం అసంభవం. ఇక నామరూపాలే లేని శుద్ధ చైతన్య స్వరూపమైన ఆత్మకు, "నేను" అనే తలంపు కలగడానికి అవకాశమే ఉండదు. ఆత్మ అనంతము. దానికి ఒక ప్రత్యేక స్వరూపము, ఉనికీ లేనేలేవు కదా! ఇటు శరీరానికీ, అటు ఆత్మకీ చెందనిదైన, యీ అహంకార భావం అవాంతరంగా తోచే భ్రాంతి భావమే కాని, యదార్థం కాదని, సూక్ష్మంగా విచారణ చేస్తే తప్పక తెలిసిపోతుంది. జీవుడనే వాడుగా భాసిస్తూన్న యీ అహంకారపు భ్రాంతి అన్ని అనర్థాలకూ మూలమై, మన నిజ స్వరూపమైన ఆత్మానుభూతిని అటంకపరుస్తున్నదని మన వేదాంతశాస్త్రాలు ఎంతో విపులంగా విశదపరుస్తున్నాయి. జాగ్రదావస్థలో ఈ "నేను" అనే భ్రాంతి భావం ఉత్పన్నమవటం వల్లనే, మనస్సు, ఇంద్రియాలు, విషయాలు అన్నీ తెలియబడుతున్నాయి. అనుభవానికి వస్తున్నాయి. అందుకే ఈ అహంకార భావాన్ని ద్రష్ట అన్నారు. ఈ ద్రష్ట లేకపోతే తెలియబడే దృశ్యాలేవీ తెలియబడవు. ఈ ద్రష్ట

అనబడే అహంకారం వట్టి భ్రాంతి భావమే కాని యదార్థమైంది కాదని తెలిసిపోయింది కనుక, ఆ ద్రష్టచే తెలుసుకోబడే దృశ్యాలన్నీ వాస్తవాలెలా అవుతాయి? భ్రాంతి భావాలు యదార్థ విషయాలెన్నడూ అవవు. దృష్టయే మిధ్య అయినపుడు, దృక్కు, దృశ్యాలు కూడా మిథ్యాస్వరూపాలే అవుతాయి. యదార్థంగా ఉండేవి ఎంతమాత్రం కాజాలవు. ఇక, ఈ భ్రాంతి స్వరూపమైన "నేను నేన"ని భాసించే అహంకారం ఎవరని, ఎక్కడనుంచి ఉద్భవిస్తున్నదని, ఏకాగ్రచిత్తంతో, అంతర్ముఖంగా, అత్యంత శ్రద్ధతో విచారణ చేస్తే, చివరకు అది లేనిదే అయి, అన్వేషి తనకుతానే అయి మిగిలిపోతాడు. తనకు తానై మిగిలేదేదో అది అనుభవైకవేద్యం. అది తెలియబడేది కాదు. స్వయంప్రకాశమై విలసిల్లే అఖండమైన సత్ చిదానందము. ఈ ఆనందానుభవమే ఆత్మానుభూతి.

"నేను" అనేది ఉన్నట్లు తోచడమే భ్రాంతి. మాయ. అజ్ఞానం, అవిద్య అని అనేక నామాలతో దాన్ని శాస్త్రకారులు వివరిస్తూంటారు. ఇది ఉండటం వల్లే జాగ్రదావస్థలో మిధ్యాస్వరూపాలైన శరీర ప్రపంచాదులు గోచరించడం జరుగుతోంది. ఎప్పుడైతే అది ఉండదో, అంతటా, ఎల్లప్పుడూ ఉంటూన్న ఆత్మ, ఉన్నదంతా తానే అయి ప్రకటితమౌతుంది. అఖండము, పరిపూర్ణము, అద్వైతము, ఆనందమయము అయిన, ఈ ఆత్మానుభవాన్నే అపరోక్ష జ్ఞానం అంటారు. భగవత్తత్త్వాన్ని విశిష్టమైన మన ఆధ్యాత్మిక గ్రంథాలు ఇలా వివరిస్తున్నాయి.

వివేకంతో విచారణ చేస్తే, స్వప్నతుల్యమైన మిథ్యాస్వరూపాలన్నీ, ఏది ఉండటంవల్ల తెలియబడుతున్నాయో, అదే పరమ సత్యమైన భగవత్ స్వరూపమని విదితం అవుతుంది. దానినే ఎరుక (Awareness) లేక ఆత్మ (Consciousness) అంటారు. భగవంతుడంటారు. తురీయమని, కూటస్థమనీ కూడా అంటారు. ఇలా శాస్త్రకారులచే అనేక నామాలతో వివరింపబడేది ఏదైతే ఉన్నదో, అదే మన నిజస్వరూపం. తెలియబడేవన్నీ అనిత్యమైన మిథ్యాస్వరూపాలు కనుక, వాటినుండి విముక్తి పొందడమే అన్నిఆధ్యాత్మిక సాధనల లక్ష్యం అవుతుంది.

"యత్ర నాన్యత్ పశ్యతి, నాన్యత్ శ్రుణోతి, నాన్యత్ విజానాతి తత్భూమా" అని వేదాంతశాస్త్రం వ్యక్తపరుస్తోంది. అంటే, ఎక్కడ ఎవరూ అన్యమైన దేనినీ చూడరో, దేనినీ వినరో, ఇతరమైన దేనినీ ఎరుగరో, అలాంటి పరమ మౌనస్థితియే ఆత్మ. అదే భగవత్ స్వరూపం. మన నిజస్వరూపం. ఈ పరమ సత్యం కేనోపనిషత్తులో విపులంగా వివరించబడింది :-

అన్యదేవ తద్విదితాదథో అవిదితా దధి
ఇతి శుశ్రుమ పూర్వేషాం యేన స్తద్ వ్యాచచక్షిరే ॥
(కేనోపనిషత్తు)

అంటే, తెలియబడే వాటిని తెలుసుకుంటున్న తెలివి కంటె, అది (ఆత్మ) నిశ్చయంగా విలక్షణమైనది. ఇంతేకాక, తెలియబడక, అవ్యక్తంగా ఉండే దానికంటె కూడా అది (ఆత్మ) అతీతమైనది.

ఈ విధంగా యీ ఉత్కృష్టమైన విషయాన్ని మా పూర్వీకులైన ఆచార్యులు మాకు తెలుపగా విన్నాము.

> శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనోయద్
> వాచోహవాచం స ఉప్రాణస్య ప్రాణః
> చక్షు శ్చక్షురతి ముచ్యధీరాః
> ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి ॥ (కేనోపనిషత్తు)

అంటే, ఆత్మ శక్తిచేతనే చెవులు వినగలుగుచున్నవి. కళ్లు చూడగలుగుచున్నవి. నోరు మాట్లాడగలుగుచున్నది. మనస్సు సంకల్పించగలుగుచున్నది. ప్రాణములు శరీరములో పని చేయగలుగుచున్నవి. జడసముదాయాలైన ఇంద్రియాలకూ, మనస్సుకూ, ప్రాణాలకూ ఆత్మ విలక్షణుడని తెలుసుకున్న బుద్ధిమంతుడు, అజ్ఞానపు మాలిన్యం వదలినవాడై, తన నిజస్వరూపం అయిన ఆత్మను గుర్తించుకుని అమరుడౌతాడు.

దేనిని మనస్సు గ్రహించలేదో, అయితే దేనిచేత మనస్సు సర్వమునూ గ్రహించగలుగుతోందో, దేనిని దృష్టి చూడలేదో, కాని దేనిచేత చక్షువులకు దృష్టి కలుగుతోందో, దేనిని చెవులు వినలేవో, అయినను దేనిచేత చెవులకు వినికిడి శక్తి కలుగుతోందో, దేనిని ఘ్రాణేంద్రియం (నాసిక) వాసన చూడజాలదో, కాని దేనివలన దానికి వాసన చూచే ప్రవృత్తి కలిగిందో, అదే ఆత్మ (భగవత్) స్వరూపమని, ఉపనిషత్తుల్లో వివరింపబడింది.

పరమ సత్యమైన మన నిజస్వరూపం, విషయ రహితమై, విలక్షణంగా, ఎల్లప్పుడూ, అంతటా భగవంతుడనే పేరుతో వెలిగి-

ఎంతమాత్రం ఇష్టపడడు. ఆ కార్యక్రమాలన్నీ అర్థరహితమైన వని అవగాహన చేసుకున్నాడు గదా। మిథ్యాస్వరూపాలైన ప్రాపంచిక విషయాల జోలికి పోనివాడే ప్రపంచం యొక్క మిథ్య త్వాన్ని నమ్మినవాడు. వాటిని గురించి ఏమాత్రం ఆలోచించినా, ప్రపంచం యొక్క మిథ్యత్వాన్ని సమ్మతించలేని వాడౌతాడు। మిథ్యాస్వరూపమంటే యదార్థంగా లేనటువంటి దాన్ని ఉన్నట్లు అపోహపడడం. ఈ అపోహనే మిథ్యాజ్ఞానమని కూడా అంటారు. మిథ్యాజ్ఞానమంతా మనోసృష్టి. మనస్సంటే సంకల్ప వికల్పాలు. వీటివల్లే దృశ్యమానమైన మిథ్యాప్రాపంచిక ప్రవృత్తి కలగడం. ఈ అసత్యపు ప్రవృత్తిని నిరోధిస్తేనే, శుద్ధచైతన్యం, ప్రశాం తతతో, నిత్యానందంగా, దానంతట అదే మన నిజస్వరూపంగా భాసిస్తుంది. అది అవధులులేని అనంతమై, ఎప్పుడూ ఉన్నదే. నిత్యసత్యాత్మ చైతన్య స్వరూపం. ఈ యదార్థ గ్రాహ్యమే అస లైన ఆధ్యాత్మికం. ఈ గ్రాహ్యమే ఎరుక (Self-Consciousness or Awareness) అనబడుతుంది. ఇది అన్ని విషయాలకీ, విచారానికీ స్వస్తి చెబుతుంది. ప్రాపంచిక మిథ్యాజ్ఞానం నుంచి, అంటే తెలియబడే వాటన్నింటినుంచీ విముక్తి కలిగినప్పుడే ఈ పరమార్థ స్థితి సంప్రాప్తిస్తుంది. ఇదే మన సర్వవేదాంత సిద్ధాంత సారం.

హైదరాబాద్ | ఇట్లు
తేది : 1-10-1989 | భాగవతి రామమోహనరావు

# ప్రార్థన

చైతన్యం సర్వగం సర్వం
సర్వభూత గుహాశయమ్
యత్సర్వ విషయాతీతం
తస్మై సర్వవిదే నమః ॥

తా॥ త్రికాలములలో జరుగుచుండు సర్వ కార్యములకూ సాక్షియై, స్వసన్నిధి మాత్రాన సర్వమునూ సూర్యునివలె భాసింపజేయుచూ, అన్నింటినీ వ్యాపించి, వాటికి విలక్షణుడై, అందరి బుద్ధి వృత్తులయందు నేను, నేనని స్ఫురించుచుండు ఏకైక రూపమగు పరమాత్మ చైతన్యమునకు నమస్కారము.

ఓం

శ్రీ శంకర భగవత్పాద విరచిత

# మోహముద్గరః

## ప్రబోధ రత్నావళి

భజ। గోవిన్దం భజ। గోవిన్దం
గోవిన్దం భజ। మూఢమతే।
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి "డుకృఞ్ కరణే" ॥

**తాత్పర్యము :**

ఓ మూఢమతీ! సృష్టికర్తయైన గోవిందుని భజించు నీకు అతి సన్నిహితంగా ఉండే మృత్యువు ఎప్పుడేనా నిన్ను కబళించగలదు. అప్పుడు ఈ పఠించే వ్యాకరణ పాఠాలేవీ నిన్ను రక్షించలేవు. ఇది గుర్తించుకో. సత్యాన్ని తెలుసుకునే ముక్తిమార్గం చూసుకో.

**వివరణ :**

కాశీ నగరంలో ఉంటూ ఒకరోజు ఉదయం స్నానానికి గంగా నదికి వెళుతున్న శంకర భగవత్పాదులు, దారిలో వ్యాకరణ పాఠాన్ని

వాలని, వ్యర్థంగా ఈ అపురూపమైన మానవ జన్మని పోగొట్టుకోకూడదని, శంకర భగవత్పాదులు, ఈ మొదటి శ్లోకంలో చెప్పిన బోధను అత్యంత శ్రద్ధాభక్తులతో గ్రహించుకోవాలి.

ఆత్మ దర్శనమే మానవజన్మకి ముఖ్య కర్తవ్యం. ఆత్మదర్శన మంటే సత్యస్వరూప సాక్షాత్కారం. తన నిజ స్వరూపం నామరూపాలు లేని ఆత్మ స్వరూపమని గ్రహించుకుని, ఆ ఆత్మ స్వరూపంలో అను భూతిని పొందడమే ఆత్మదర్శనం. అశాశ్వతమైన ఈ శరీరం తాను కాదని గ్రహించుకుని, దేహాత్మభావాన్నీ, ప్రపంచకపు భ్రాంతినీ పోగొట్టు కుంటే కాని ఆత్మ దర్శనం ప్రాప్తించదు. అలా ఆత్మను సాధించకపోతే ఉత్కృష్టమైన ఈ మనుష్య జన్మ వ్యర్థం అయిపోతుంది. జంతువులు, పక్షులు మొదలైన వాటిలా మనిషి జీవితమంతా అజ్ఞానంలో, అంధ కారంలో, ఇంద్రియ సుఖాలకోసమే సాగించి, ముగిస్తే, అది ద్విపాద పశు జీవిత మవుతుంది. ఐశ్వర్యం ఎంత సంపాదించినా, ఎంతెంత పదవుల్లో ఉన్నా, పేరుప్రతిష్ఠలెన్ని గడించినా, అవన్నీ అజ్ఞానాన్ని పోగొట్టలేవు గదా? అలాంటి వారందరూ, ఏమీ తెలియని అజ్ఞానంలోనే ఉండిపోయి, చివరికి అంత్యదశలో, జీవితమంతా వ్యర్థం అయిపోయిందని బాధ పడుతూ, నిస్పృహతో గతించిపోతున్నారు.

తన నిజస్వరూపం ఏదో తెలుసుకున్నవాడే యదార్థమైన మనుడు. తెలివైనవాడు. అమూల్యమైన జీవితకాలాన్ని వ్యర్థంగా పోగొట్టుకోక చిత్తశుద్ధితో సక్రమమైన ఆధ్యాత్మిక సాధనని చేపట్టి, ఆత్మానుభూతికోసం ప్రయత్నించేవారే, నిజమైన మానవజన్ములు. అలాంటి మానవోత్తములు, సత్యవేత్తలై, బ్రహ్మానంద సాగరమైన ఆత్మానుభూతితో తన్మయత్వం పొంది, జీవితాల్ని సార్థకం చేసుకున్నవారౌతారు.

## (2)

మూఢ ! జహీహి ! ధనాగమతృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్
యల్లభసే నిజకర్మో పాత్తం
విత్తం తేన వినోదయ ! చిత్తమ్ ॥

**తాత్పర్యము :**

ఓ మూఢుడా! ధనవ్యామోహాన్ని ఒదుల్చుకో. ఇంకా ఎంతో డబ్బు సంపాదించాలనే పేరాశను పెట్టుకోకు. సద్బుద్ధిని కలిగి, నీకున్న ధనము నీ పూర్వ కర్మాను సారము లభించిందని, దానితో తృప్తికలిగి ఉండు. మనస్సును ఇలా సమాధానపరచుకుంటే, ధనాశ నిన్నింక పీడించదు. ప్రశాంతత చేకూరుతుంది.

**వివరణ :**

బొత్తిగా వివేకం లేనివాళ్ళు, జీవితానికి ధన సంపాదనే లక్ష్యమని అనుకుంటారు. ఎప్పుడూ, డబ్బు సంపాదన గురించీ, తమకున్న ఐశ్వర్యాన్ని పెంచడాన్ని గురించీ ఆలోచిస్తూంటారు. ఇంకా కొందరు దుర్మతులు డబ్బు సంపాదన కొసం అవినీతి పనులు చెయ్యడానికి కూడా జంకరు. త్వరత్వరగా ఎక్కువ డబ్బు సంపాదించాలని ఏవేవో పనులు చేస్తూ, పథకాలు వేస్తూ చివరికి అశాంతికీ, దుఃఖానికీ గురి అవుతారు. ధన వ్యామోహం మనిషిని పతనం చేస్తుంది. వివేకహీనుణ్ణి చేస్తుంది.

ధనం ప్రాప్తించాలంటే దైవకృప ఉండాలని కొందరు భావిస్తూంటారు. దానినే అదృష్టం అంటారు. అదృష్టం తోసుకువస్తే, లక్ష్మి దానం

తట అది వస్తూంటుందని వారి నమ్మకం. ఎవరికి ఎప్పుడు ఏది అవసరమో, అది సంప్రాప్తం అవుతూంటుంది. కనుక ఏది సంభవించినా, అది దైవనిర్ణయం అని స్వీకరించడం వివేకానికి లక్షణం.

ధన వ్యామోహం గలవాడు ఆధ్యాత్మిక సాధనలకి ఎంతమాత్రం పనికిరాడు. అట్టివాని మనస్సులో ఎప్పుడూ ధనాశాపిశాచమే ఉంటుంది. భగవత్తత్త్వం, అటువంటి మనస్సులో ప్రవేశించే అవకాశం ఉండదు. మానవ జీవితం యొక్క విలువ తెలుసుకోలేని మూఢులు, ధనార్జనతోనే జీవితం అంతా గడిపి చివరికి సంపాదించినదంతా ఇక్కడే వదలిపెట్టి భయంతో, దుఃఖంతో మరణాన్ని పొందుతారు.

## (3)

నారీ స్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగాః మోహావేశమ్
ఏత న్మాంసవసాది వికారం
మనసి విచిన్తయ వారంవారమ్ ॥

తాత్పర్యము :

భారంతో వున్న స్త్రీల స్తనాలనీ, నాభిప్రదేశాన్ని చూసి అవివేకివై, మోహావేశాన్ని పొందకు. అదంతా ఏమిటో జాగ్రత్తగా మనసుతో తరిచి, ఆలోచించి చూడు. భారంతో కూడిన ఆ స్తనాలూ, నాభిప్రదేశల అంతా వికారమయమైన మాంసం, క్రొవ్వు మొదలైన వికృత పదార్థపు ముద్దలని, పదేపదే ఆలోచించి గుర్తించుకో.

కుంటే, శరీరం తానెంతమాత్రం కాదని, తాను దేహానికి ద్రష్టనని తెలుసుకోగలుగుతాడు. అలాంటి తెలివి దృఢంగా కలగడంతో, స్త్రీ వ్యామోహం వదలిపోవడమే కాక, స్త్రీ పురుష భేద బుద్ధి కూడా నశిస్తుంది. ఈ శరీరాలలోని అందరూ యదార్థంగా ఒకటే అయిన ఆత్మచైతన్యమనే అద్వైతజ్ఞానం కలుగుతుంది. అలాంటి విశిష్ట జ్ఞానాన్ని కలిగించే శంకర భగవత్పాదుల ఉద్దేశం ఈ శ్లోకంలో దాగి ఉందని గ్రహించుకోవాలి.

## (4)

నలినీదలగత జల మతితరలం
తద్వజ్జీవిత మతిశయ చపలమ్
విద్ధి। వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతం చ సమస్తమ్॥

తాత్పర్యము :

తామరాకు మీద నీరు ఎలా చంచలంగా అటూ, ఇటూ అన్ని వైపులకూ పరుగెడుతూ పోతూంటుందో, అలాగే ఈ జీవితం కూడా ఎన్నో ఒడుదుడుకులతో సాగిపోతూంటుంది. అంటే రాగద్వేషాల్లో బంధితులై బొత్తిగా నిలకడలేకుండా వున్న సమస్త జీవులూ, మనస్సు, ఇంద్రియాలు ఎలా ప్రేరేపిస్తే అలా చేస్తూంటారు. ఈ శరీరం అనేక వ్యాధులతో, దురభిమానంతో, దుఃఖంతో పీడించబడుతూ ఉంటుంది.

డైనా నశించిపోయేదేనని గ్రహించుకోవడమే వివేకం. ఇలాంటి వివేకాన్ని కలుగజేసే ఉద్దేశంతో ఈ శ్లోకం చెప్పబడింది.

జీవితం ఏమిటో ఎవరూ ఆలోచించరు. సతతమూ చంచలత్వం, చపలత్వంతో సాగే ఈ జీవితం యొక్క యథార్థత్వాన్ని గుర్తించుకోరు. తానీ శరీరమనుకునే దేహాభిమానాన్ని ఒదుల్చుకోడానికి యత్నింపరు. ఈ దురభిమానం వల్లనే శరీరానికి సంక్రమించే బాధలు, వ్యాధులు, జరా మరణాలు అన్నీ తనవేనని దుఃఖపడతాడు తానీ శరీరమనుకునే అజ్ఞానం ఎంతకాలం ఉంటుందో, అంతకాలం అంతా దుఃఖమయమే. అజ్ఞానం కంటె దుఃఖమైంది ఇంకేముంటుంది? తనకు తెలియబడుతూండే శరీరానికీ, మనోబుద్ధీంద్రియాలకీ అతీతంగా ఉంది తన యదార్థ నిజ స్వరూపం. దాన్ని సాధించి తన నిజస్వరూపంలో అనుభూతిని పొందడమే మానవజన్మని కర్తవ్యం.

## (5)

యావ ద్విత్తోపార్జన సక్త
స్తావ ద్రక్తో నిజపరివారః
పశ్చా జ్జీవతి జర్జరదేహే
వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే ॥

తాత్పర్యము :

"మనిషి ధనాన్ని సంపాదించే ఓపికతో ఉన్నంత కాలమే అందరూ అతన్ని ప్రేమతో చూస్తారు. గౌర

కార్యాలు చేసినా, చివరికి జీవితం అంత్యదశ, ఇలా పరిణమిస్తుందని, వైరాగ్యాన్ని పెంపొందించడానికి, శంకర భగవత్పాదులచే ఈ శ్లోకం చమత్కారంగా చెప్పబడింది. కేవలం ధనసంపాదన కోసమే జీవిత మంతా గడిపివేసి, విజ్ఞానహీనుడై వృద్ధాప్యంలో ప్రవేశించిన ద్విపాద పశువులాంటి మనిషికి, ఎలాంటి విలువా వుండదని ఈ శ్లోకం యొక్క అంతరార్థం.

## (6)

యావ త్పవనో నివసతి దేహే
తావ త్పృచ్ఛతి కుశలంగేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్ కాయే ॥

**తాత్పర్యము :**

శరీరంలో ప్రాణవాయువు ఎంతవరకూ ఉంటుందో అంతవరకూ ఇంట్లో అందరూ కుశలంగా ఉన్నాడో లేదో అని క్షేమసమాచారాలు అడుగుతూంటారు. ప్రాణం పోయిన శరీరం (శవం) అంటే అందరికీ భయమే. దానిని చూడటానికి భార్యే భయపడిపోతుంది.

**వివరణ :**

శరీరమన్నా, ఇంటిలో భార్యాపుత్రాది పరివారమన్నా మమ కారము, వ్యామోహము కలిగి ఉండరాదనే వైరాగ్యభావాన్ని బోధించే

శ్లోకం యిది. శరీరంతో తాదాత్మ్యభావం వల్ల, శరీరమే తాను అనుకొనే భావం- దేహాత్మబుద్ధి- దృఢంగా ఉంటుంది. అందుకే శరీరమంటే ఎంతో వ్యామోహం కలిగి ఉంటారు. దేహం ఎల్లకాలం ఉండిపోయేది కాదనీ, త్వరత్వరగా మారిపోతూ చివరకు శిథిలమై నశించిపోయే జడ పదార్థమయమైనదని గుర్తించుకోరు. ఎంతవరకూ శరీరంలో ప్రాణం ఉంటుందో, అంతవరకే ఆ శరీరం అంటే అందరికీ విలువ. ప్రాణం పోయిన శరీరం (శవం) అంటే అందరికీ భయమే. దానిని చూడడానికి కూడా ఇష్టపడరు. ముఖంమీద గుడ్డకప్పి వేస్తారు.

జాగ్రదావస్థలో భార్యాపుత్రాదులను ఎలా తెలుసుకుంటున్నామో, అలాగే ఈ శరీరాన్ని కూడా మనం తెలుసుకుంటున్నాము. స్వప్న, సుషుప్త్యావస్థలలో శరీరం తెలియబడదు. శరీరంతోపాటు ప్రపంచం కూడా తెలియబడదు. స్వప్నావస్థలో మనస్సొకటే పనిచేస్తూంటుంది. దేహాత్మ భావంకాని అహంకారం కాని ఉండవు. ఇక సుషుప్తి (గాఢనిద్ర)లో మనస్సుకూడా ఉండదు. అన్ని విషయాలు, అనుభవాలు అదృశ్యమై ఒక సూక్ష్మమైన చైతన్యం మాత్రం ఉంటుంది. మనమైతే, ఎప్పుడూ మూడవస్థల్లోనూ, ఉండేవాళ్ళమే. శరీరాలు, మనోవికారాలు, అహంకార భావాలు - ఇవన్నీ వస్తూంటాయి. పోతూంటాయి. ఇలాంటి వివేకం కలగ డానికే ఈ వైరాగ్య బోధ

జడమైన ఈ శరీరం మనం కాకపోతే మనం ఎవరమో విచారించు కోవాలి గదా! శరీరాన్ని, ఇంద్రియాల్ని, మనస్సుని, బుద్ధిని, రాగ ద్వేషాల్ని, ప్రపంచాన్ని అన్నింటినీ ఎవరైతే తెలుసుకుంటున్నారో ఆ తెలివియే మన యదార్థమైన స్వరూపం అని గుర్తించుకోవాలి. ఆ సత్య స్వరూపమైన ఆత్మస్వరూపంలో అనుభూతిని పొందాలి. దానికి సక్రమ మైన అధ్యాత్మిక సాధన చెయ్యాలి. లేకపోతే ఈ నరజన్మ వృధాగా

అంతరించిపోతుంది. ఎక్కడికి పోతున్నారో, ఏమైపోతున్నారో తెలియని అజ్ఞానంలో ప్రపంచంలో శరీరాన్ని వదలిపెడుతున్నారు. ఆ శరీరాన్ని కాలుస్తారు. లేక భూస్థాపితం చేస్తారు. లేదా కొన్ని మతాచారాల ప్రకారం జంతువులకు, పక్షులకు ఆహారంగా అవుతుంది. దీనిని గురించి యదార్థ జ్ఞానం సంపాదించే ప్రయత్నం ఎంతమాత్రం చెయ్యక జీవితకాలాన్నంతా వ్యర్థంగా గడిపివెయ్యడం మూఢత్వం కాక ఏమౌతుంది?

## (7)

బాల స్తావ త్క్రీడాసక్త
స్తరుణ స్తావ త్తరుణీసక్తః
వృద్ధ స్తావ చ్చిన్తాసక్తః
పరే బ్రహ్మణి కోఽపి న సక్తః

**తాత్పర్యము :**

బాల్యావస్థలో ఆటలలో నిమగ్నులై వాటికి సంబంధించిన అనేక ఆసక్తులతో వాటికోసం తల్లడిల్లుతూంటారు. ఇక కొంతకాలం గడచి యౌవ్వనంలో ప్రవేశిస్తే, కాంతల మీద వ్యామోహం బయలుదేరుతుంది. మనస్సంతా యువతుల కోసం ఆరాటపడుతూ అవివేకంతో భ్రమించిపోతూంటారు. ఇక వృద్ధాప్యం మీదకు వస్తే, వ్యాధులతో, చింతలతో క్రుంగుతూ మనస్సులో ఆనందమనేది లేనివారై ఉంటారు. తన నిజస్వరూపం అయిన పరబ్రహ్మమునందు ఎవరూ ఆసక్తి కలిగి ఉండరు.

పుట్టె యున్నాడని గుర్తించుకోడానికి ఎలాంటి ప్రయత్నం చెయ్యడు. దేహాత్మబుద్ధి వివేకసూన్యుణ్ణి చేస్తుంది. శరీరం, ఇంద్రియాలు, విషయాలు, ప్రపంచం- ఇవన్నీ ఇలా ఎల్లకాలం ఉండిపోయేవేనని అనుకుంటూ జీవితం గడిపేస్తాడు. కాని, వాటిని గురించి ఏమీ ఆలోచించడు. ప్రకృతివల్ల ఆపాదించబడిన, అసత్యపు భ్రాంతియే యీ అవివేకానికి మూలం. ఈ భ్రాంతి సులువుగా పోయేదికాదు. ఇది ఎన్నో జన్మలనుంచి వస్తూన్న ప్రారబ్ధ సంచితం. ఇది పోవాలంటే, జీవితాన్ని మార్పు చేసుకుని, సన్మార్గం నిస్వార్థం, వైరాగ్యం మొదలైన ఆధ్యాత్మిక ప్రయోజనాలను చేపట్టి, సాధనకు పూనుకోవాలి. అప్పుడే అపురూపమైన మానవజన్మ సార్థకం అవుతుంది.

## (8)

కాతే కాన్తా ః కస్తే పుత్త్రః ?
సంసారోఽయ మతీవ విచిత్రః ?
కస్య త్వం ? కః ? కుత ఆయాత
స్తత్త్వం చిన్తయ ః యదిదం భ్రాతః ॥

తాత్పర్యము :

నీకు నీ భార్య ఎవరు? పుత్రుడెవడు? అంటే నీకు వాళ్ళకు గల సంబంధం ఎట్టిది? ఈ సంసారం ఎంతో విచిత్రమైనది. నీవెవరికి చెందినవాడవు? ఎవరవు? ఎచటనుండి వచ్చినాడవు? ఈ విషయాలను నీవు తరచి తరచి ఆలోచించుకోవాలోయ్, సోదరుడా !

*వివరణ :*

జీవితమంతా మనిషి నిరంతరం భార్యాపుత్రాదుల కొరకే తాపత్రయ పడిపోతాడు. చివరికి పాశబద్ధుడై ఏమీ తెలియని, అవివేకంతో తానెవరో, ఎక్కడనుంచి వచ్చాడో, ఎక్కడికి పోతున్నాడో ఏమీ తెలియని అజ్ఞానాంధకారంలో జీవితాన్ని వదలిపోతాడు. ఇలాంటి మూఢ మానవులకు వివేకం కలిగించే ఉద్దేశంతో ఈ శ్లోకం చెప్పబడింది.

మనిషిని అనేక వ్యామోహాలు, మమకారాలు బంధించి, వివేకశూన్యుణ్ణి చేస్తాయి. అన్ని వ్యామోహాలకంటే తన గృహము, తన భార్యాపుత్రాదుల మీద మమకారము అతి ప్రధానమైనది. మృత్యువెంత మీదకి వచ్చినా, ఈ మమకారం వదలిపోదు. దానిని ఒదుల్చుకోటం దుస్సాధ్యం అవుతుంది. ఆ మమకారంతోనే శరీరాన్ని విడుస్తాడు. నిజంగా ఆలోచించి పరిశీలిస్తే గృహానికీ, చెరసాలకీ ఏమీ తేడా లేదని చెప్పవచ్చు. చెరసాలలో ఉంచబడి, ఇనుప గొలుసులతో బంధింపబడిన నేరస్తుడు, దాంట్లోంచి తప్పించుకుని బయటకుపోవడం ఎంత దుస్సాధ్యమో, అలాగే భార్యాపుత్రాదుల మీది ప్రేమపాశంతో బద్ధుడైన గృహస్థుడు ముక్తిని పొందడం అంత అసంభవం. తన ఇంటిమీద అభిమానాన్ని, మమకారాన్ని రెండుకాళ్ళకూ కట్టబడిన గొలుసుల్లాంటివని, ఇక భార్యాపుత్రాదుల మీది ప్రేమ కంఠానికి తగిల్చిన ఉరితాడు వంటిదని, శంకర భగవత్పాదులు వేరే గ్రంథాల్లో కూడా వివరించారు.

నదీ ప్రవాహంలో కొట్టుకుపోయే కర్రలు, కొన్ని ఒక దగ్గర జేరి కొంత తడవు కలిసి ప్రవాహంలో పోతూంటాయి. ప్రవాహవేగంలో మళ్ళీ విడిపోతూంటాయి. అలాంటిదే ఈ సంసారంలోని భార్యాపుత్రాదుల సంబంధం అని చెబువారు తత్వవేత్తలు. అనిత్యమైన ఈ భవబంధాల్ని నమ్ముకుని, ఇవే శాశ్వితం అనుకుంటారు. వృద్ధులైకూడా, దారాపుత్రా

దుల మీద వ్యామోహాన్ని ఒదులుచ్చుకోలేక, ఉత్కృష్టమైన మనుష్యజన్మని నిరర్థకం చేసుకుని, చివరికి అజ్ఞానాంధకారంతో కాలధర్మం చేస్తారు.

ఎంతో పూర్వజన్మ సుకృతంవల్ల మనుష్య జన్మ లభిస్తుంది మన చుట్టూ ఎన్నో రకాల జీవరాసులు కనిపిస్తూంటాయి- జంతువులు, పక్షులు, జలచరాలు, కీటకాలు, చెట్లు. ఎన్నో రకాల స్థావర జంగమరూపాల సృష్టితో ప్రపంచం సాగుతూంది. ఇలాంటి వివిధ రకాల జీవరాసులు ఎనుబదినాలుగు లక్షలున్నాయంటారు. ఇంతటి పలువిధ జీవరాసుల్లో, మనుష్య జీవితం ప్రాప్తించిందంటే ఎంత అదృష్టం? మిగతా జీవరాసుల్తో పోల్చి చూసుకుంటే మనిషి ఎంత అదృష్టవంతుడు? సృష్టిలో సర్వోత్కృష్టం అయిన మనుశ్యశరీరం ప్రాప్తించడంవల్ల, ఏది నిత్యమో, ఏది అనిత్యమో నిర్ణయించుకొనే అవకాశం కలిగింది. పశు, పక్ష్యాది ఇతర జీవరాసుల్లో, యీ విజ్ఞానం సూన్యం. నిత్యానిత్య వస్తు వివేకంతో స్వస్వరూప సాక్షాత్కారానికి సాధన చెయ్యడానికే భగవంతుడు మానవజన్మ ప్రసాదించాడన్నది తార్కాణమౌతుంది. ఇలాంటి ఉత్కృష్టమైన మానవ జీవితాన్ని నిరర్థకంగా గడిపి గతించటానికి కాదని గుర్తించినవాడే వివేకవంతుడు.

## (9)

సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం
నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥

**తాత్పర్యము :**

సత్సాంగత్యం వల్ల లౌకిక విషయాలపట్ల నిస్సంగత్వం ఏర్పడుతుంది. నిస్సంగత్వం పొందడంవల్ల దేని మీదా ఆకమోహం కలగదు. మనోనిశ్చలత కలుగుతుంది. సచ్చిదానంద మయమైన ఆత్మానుభూతి కలుగుతుంది, జీవన్ముక్తుడౌతాడు.

**వివరణ :**

ఆధ్యాత్మిక సాధకులు ఎన్నో నియమాలు పాటించవలసి ఉంటుంది. మనోనిగ్రహానికి, చిత్తశుద్ధి కలగడానికి యమనియమాలు అష్టాంగ యోగంలో మొదటి విధులు. యమనియమాల పునాదిమీదే ఆధ్యాత్మిక సాధనాసౌధం నిర్మించబడుతుంది. యమ నియమాలు పాటిస్తూ ఏకాంతంగా ఉండి సాధన సాగించాలని శాస్త్రాలు చెబుతూంటాయి. ఏకాంతంగా ఉండటం చాలా ముఖ్యం. ప్రపంచమంతా లౌకికులతో, సంసారులతో నిండి ఉంటుంది. అనేక విషయవాసనలతో, రాగద్వేషాదులతో చుట్టూ మనుష్యులంతా సంచరిస్తూంటారు. నిలకడలేని మనస్సు, వివేకంలేని బుద్ధి, శుద్ధిలేని చిత్తం, శరీరమే తాను అనుకొనే అహంకారం– వీటితో మానవుల మనుగడ సాగుతూంటుంది. ఇటువంటి వారితో సాంగత్యంవల్ల, చేస్తున్న ఆధ్యాత్మిక సాధనంతా నిష్ఫలమై పోతుంది. శుభ్రమైన పాలను నీళ్ళతో చేరిస్తే, అవి నీటిలో కలిసిపోతాయి. ఆ పాలని మళ్ళీ విడతీయలేము. కాని, ఆ పాలను అటువంటి స్వచ్ఛమైన పాలతో కలుపుతే మళ్ళీ ఆ పాలను తిరిగి పొందవచ్చు. అలాగే కొంత సాధనచేసి పవిత్రత పొందిన సాధకుడు, అజాగ్రత్తగా లౌకికులతో తిరుగుతే, తాను పొందిన ఆధ్యాత్మిక ప్రగతి నుంచి దిగజారిపోతాడు. తన లక్ష్యాన్ని కోల్పోవడమే కాకుండా, తనలోని శ్రద్ధ, పట్టుదల, మనోనిగ్రహశక్తి, అన్నీ నశించి

పోతాయి. కనుక ఆధ్యాత్మిక సాధకులు, కేవలం లౌకిక జీవితం గడిపే ప్రపంచకులకు దూరంగా, ఏకాంతంగా ఉంటూండాలి. సన్మార్గంలో సాధనచేసే సాధకులతోనే సాంగత్యం చెయ్యాలి. దీనివల్ల అసలైన సత్ సాంగత్యం లభిస్తుంది.

అసలైన సత్‌సాంగత్యం అంటే ఆత్మసాంగత్యం. సత్ అంటే బ్రహ్మస్వరూపం. బ్రహ్మస్వరూప సాంగత్యమే యదార్థమైన సత్ సాంగత్యం. ఆత్మానుసంధానపరుడై, స్వస్వరూప ధ్యానంలో ఉండటమే నిజమైన సత్‌సాంగత్యం. అలాంటి సత్‌సాంగత్యంవల్ల ప్రపంచ శరీరాదుల యొక్క మిధ్యాస్వరూపం గ్రహించుకోగలుగుతాడు. పంచభూతాలు, ప్రపంచం, శరీరం, పంచేంద్రియాలు, మనోబుద్ధి, చిత్త, అహంకారాలు– ఇవేమీ తనుకాదని, ఇవన్నీ తన నిజస్వరూపానికి భిన్నమైన భ్రాంతులని తెలుసుకోగలుగుతాడు. ఇక వాటితో సాంగత్యానికి ఇష్టపడడు. అవేవీ అతనిని ఆకర్షించలేవు. వాటినుండి నిస్సంగత్వం ఏర్పడుతుంది. అవన్నీ అసత్యమైన అనాత్మజాతాలనే వివేకం కలుగుతుంది. దేనిమీదా ఇక మోహం అంకురించదు. ఎల్లప్పుడూ, తన నిజస్వరూపమైన సత్‌సంగం లోనే ఉండాలని ఉంటుంది. ఇదే నిశ్చలమైన తత్వం. సకల సాధనాలకు లక్ష్యమైన, సర్వోత్కృష్టమైన ఆధ్యాత్మిక తత్వం.

## (10)

వయసిగతే కః కామవికారః ?
శుష్కే నీరే కః కాసారః ?
క్షీణే విత్తేకః పరివారో ?
జ్ఞాతే తత్త్వే క స్సంసారః ॥

**తాత్పర్యము :**

వయస్సు గడిచి వృద్ధాప్యంలో ప్రవేశించిన వానికి కామవికారాలు ఏముంటాయి? నీరు పూర్తిగా ఎండిపోయి నపుడు ఇక చెరువెక్కడుంటుంది? ధనమంతా తరిగి పోయిన తరువాత, ఇక పరివారం ఎక్కడుంటారు? పర మాత్మ తత్త్వం అవగాహన అయిన జ్ఞానికి, ఇక సంసార బంధమెక్కడుంటుంది?

*వివరణ :*

ఉండేది సత్యస్వరూపమైన బ్రహ్మం ఒక్కటేనని, జగత్తంతా అసత్యమైన మిథ్యాస్వరూపమని మన ఆధ్యాత్మిక తత్వసారాంశం. ఇదే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే సర్వాత్మ తత్వం. పరమోత్కృష్టమైన అద్వైత సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని అవగాహన చేసుకుంటే సంసార భ్రాంతి వదలిపోతుందని శంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో చమత్కా రంగా ఉపమానాలతో బోధిస్తున్నారు.

అజ్ఞానంవల్ల ఆవహిస్తుంది మనిషికి సంసార భ్రాంతి. శరీరమే తాననుకొనే దేహాత్మభావం కలిగి అనేక దృశ్యాలతో, విషయాలతో ఆక ర్షిస్తూ, చుట్టూ కానవచ్చే ప్రపంచం అంతా యథార్థమేనన్న భావంతో జీవించడమే సంసారభ్రాంతి. వివేకంతో పరిశీలిస్తే, ఈ శరీర ప్రపం చాదులు గోచరించడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి జాగ్రదావస్థ. రెండు ఇంద్రియాలు. నిద్రానంతరం ఒళ్ళు విరుచుకుంటూ (animation) మెళకువ అనుకునే అవస్థలోకి వస్తాం. ఈ మెళకువ అనబడే దానినే జాగ్రదావస్థ అంటారు అంటే దేహాత్మభావం కలది. జాగ్రదావస్థ కలి గిన వెంటనే శరీర ప్రపంచాదులు గోచరిస్తాయి. ముందు శరీరం, తరు

వాత ప్రపంచం. శరీరం తాను అనుకునే అహంకార భ్రమలో ముందు పడతాడు. తరువాత ప్రపంచాన్ని తెలుసుకునేందుకు- శరీరానికి సంబంధించినవి- ఇంద్రియాలున్నాయి. ఈ ఇంద్రియాలవల్లే ప్రపంచాన్ని తెలుసుకోగలుగుతున్నాడు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే ఈ పంచేంద్రియాలను జ్ఞానేంద్రియాలంటారు. వీటిద్వారా ప్రపంచంలోని విషయ వస్తువుల జ్ఞానాన్ని మనిషి గ్రహిస్తాడు. ప్రతిస్పందిస్తాడు. అలా ప్రతిస్పందించి తెలుసుకున్న విషయాల్ని, క్రియారూపాలుగా చెయ్యడానికి శరీరంలో అయిదు కర్మేంద్రియాలున్నాయి- నోరు, చేతులు, పాదాలు, ఉపస్థ, పాయువు (నిసర్గ). ఈ రెండు రకాల ఇంద్రియాల జ్ఞానకర్మల వల్లే జాగ్రదావస్థలో, మనిషి ప్రపంచంలో చరిస్తూ సంసార కార్యకలాపాలు సాగించగలుగుచున్నాడు. ఈ ఇంద్రియాలు, వాటి అనుభవాలు మనిషికి దైహిక సుఖాలు, సౌకర్యాలు చేకూరుస్తాయి. వాటికోసం ఎల్లప్పుడూ తాపత్రయపడి పోతూంటాడు. కాని, మానసిక శాంతి, ఆనందం ఇంద్రియాలవల్ల మనిషికి ఎప్పుడూ లభ్యం కాలేదు. శాంతి, ఆనందం లేకపోతే, మనిషికి ఎన్ని ఉండి ఏమి లాభం. ఈ విషయం తెలుసుకున్నవాడై, ఇంద్రియాలవల్ల అసలైన ఆనందం కలగదని, పైగా వాటివల్ల అశాంతి, దుఃఖం కలుగుతోందని గ్రహించాడు. ఇలా వివేకం కలిగిన తరువాత, ఇంద్రియాలను వెనక్కి త్రిప్పుకుని, దృష్టిని అంతర్గతంలోకి ప్రసరింపజేస్తూ, సక్రమంగా ఆధ్యాత్మిక సాధన చేశాడు. అప్పుడతనికి అసలు రహస్యం అవగతం అయింది. తానెవరో అర్థం అయింది. నామ రూపాలతో గోచరించే జడపదార్థ సమ్మేళనమైన ఈ శరీరం తానెంత మాత్రం కాదని, దానికి తాను భిన్నుడనని తెలుసుకున్నాడు. దేహాత్మ భావం తనకు కలిగిన భ్రమయేకాని, యదార్థంగా తను నామరూప రహిత చైతన్యమాత్రుడనని గ్రహించాడు. తన మనస్సు కల్పించే సంకల్ప వికల్పాలకి కూడా తను భిన్నుడనని, అవన్నీ తన భ్రమలేకాని నిజాలు

కావని తెలిసిపోయినది. అంతేకాదు. ఈ మనస్సులోని సంకల్ప వికల్పాత్మక వృత్తులే బాహ్య ప్రపంచంలోని అహం మమతలకు, రాగద్వేషాదులకు, సుఖదుఃఖాదులకు కారణమౌతూంటాయని తెలుసుకున్నాడు. అంతర్గత ప్రపంచం, బాహ్యప్రపంచం, ఈ రెండూ కూడా కేవలం మనోజనిత సంకల్ప స్వరూపాలేనని గ్రహించాడు. ఈ తెలివితో తెరిపిన పడ్డాడు. అతనికిక సంసార బాధలేదు. మిథ్యాస్వరూపాలైన మనస్సుకు, శరీరానికి చైతన్యం కలగజేసేది, "నేను నేన"ని భాసిస్తూండే తన నిజస్వరూపమేనని నిశ్చయత్వం పొందాడు. అలా భాసించే ఆ "నేను నేను" అనే చైతన్యం ఎక్కడనుంచి ఉద్భవిస్తున్నదని అంతర్ముఖుడై శ్రద్ధగా ఏకాగ్రత చిత్తంతో విచారిస్తే, చివరకు ఆ చైతన్యం తానే అయి మిగిలిపోతాడు. తనకుతానై మిగిలేదేదో అది అనుభవైకవేద్యం. అది తెలియబడేది కాదు. స్వయం ప్రకాశమై విలసిల్లే సత్చితానందము. ఈ ఆనందానుభవమే ఆత్మానుభూతి.

## (11)

మా కురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషాత్కాలస్సర్వమ్
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥

తాత్పర్యము :

ఓ మూఢ మానవుడా! నాకు ఎంతో ధనమున్నదని, ఎందరో బంధువులు, బలగము ఉన్నారని, సుఖాలు

అనుభవించడానికి యౌవ్వనం ఉందని గర్వపడిపోకు. ఆ గర్వాన్ని విడిచిపెట్టు. నిముషంలో మృత్యువు వీట న్నింటినీ హరిస్తుంది. మృత్యు ముఖంలో పడగానే ఇవేవీ నీ వెంట వచ్చేవి కావు. ఇవన్నీ మాయామయమైన అస త్యపు భ్రాంతులు. వీటిని వదలి బ్రహ్మపదంలో ప్రవే శించు.

*వివరణ :*

అజ్ఞానంతో ఉన్న మనిషిని ఉద్ధరించడానికి శంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో ఇలా బోధిస్తున్నారు. అజ్ఞానం అంటే దేహాత్మబుద్ధి. 'శరీ రమే నేను', 'ఇవన్నీ నావి' అనుకొనే అహంకార 'మమకార' భావం. ఈ అహంకార భావంచేత, శరీరానికి, ప్రకృతి పరిణామాలవల్ల, సంక్ర మిస్తూన్న మార్పులన్నీ, తనవేనని భ్రమించిపోతూంటాడు. కాలగమనంతో, శరీరం బాల్య, యౌవ్వన, కౌమార, వార్ధక్యాది మార్పులు చెందుతూం టుంది. ఈ శరీర మార్పులకి అనుగుణంగా, మనిషి ప్రవర్తన సాగుతూం టుంది. యౌవ్వనంలో యువతీయువకులు ఎంతో గర్వంగా ఉంటూం టారు. ఆ యౌవ్వనస్థితి చిరకాలం అలా ఉండిపోతూందనుకుంటూం టారు. వివేకహీనమైన పనులకు పూనుకుంటారు. మదాంధకారంలో, కొందరు విచక్షణ కోల్పోయి అనేక పాపాలు చేస్తూంటారు. ఇలాంటివాళ్ళు, ధనవంతులు కూడా అయితే ఇంక పట్టపగ్గాలుండవు. ధనగర్వం మరీ దొడ్డది. అహంకారభావాన్ని ఇంకా రెచ్చగొట్టి, రాజసికంలో మనిషిని ముంచెత్తుతుంది. ధనం ఉంద కాబట్టి దాంతో ఏవేవో కార్యకలాపాలు, కల్పించుకుంటూ, బంధాలను విపరీతంగా పెంచేసుకుంటాడు. ఎందరో, బంధువులు, బలగం తనకు ఉన్నదని మిడిసిపడిపోతూ, సంసార ప్రవా హంలో మునుగుతూ, తేలుతూ, సుఖదుఃఖాలనే సుడులలో గిరగిరా తిరు

గుతూ, కొట్టుకుపోతూంటాడు. ఇవన్నీ ఎంతో అనిత్యములైనవని, తాను యదార్థంగా ఎవరో తెలియని అజ్ఞానంలో ఉన్నానని గ్రహించుకోడు. తనకత్యంత ప్రియమైన తన శరీరాన్ని, మృత్యువు ఏ క్షణంలోనైనా కబళించవచ్చునని ఎంతమాత్రం ఆలోచించడు. తని ప్రపంచంలో శాశ్వత మనే భావంతో, ఎన్నెన్నో పనులు కల్పించుకొని, విరామం లేకుండా తాపత్రయ పడిపోతూంటాడు. మరణానంతరం తనెక్కడికి పోతాడో తెలుసుకోడానికి ఎలాటి ప్రయత్నం చెయ్యడు. కాని, తన ఆస్తులు ఏమి చెయ్యాలో, ఎలా తనవారికి పంచిపెట్టాలో, వీటిని గురించే ఆలోచిస్తూ సతమతమౌతూంటాడు. తానెవరో, ఎచటినుండి వచ్చాడో, తన నిజ స్వరూపం ఏదో తెలుసుకోడానికి, ఏమీ ఆలోచించడు. ఇదే మాయా ప్రభావం. మానవుని అజ్ఞానమయ జీవితానికి ఈ మాయయే కారణం. అందుకే దీనిని కారణశరీరం అంటారు, ఈ మాయవల్ల తన సత్యస్వరూపమైన ఆత్మ మనిషికి మరుగైపోతుంది. ఇంద్రియాలకు గోచరించే శరీర ప్రపంచాదులు నిత్యమైనవని, దేహమే తన నిజస్వరూపం అని అసత్యమైన ప్రవృత్తి కలుగుతుంది. అన్ని కర్మకలాపాలకీ మూలమైన దేహమే తాననుకొనే దేహాభిమానం వల్ల భేదబుద్ధి కలిగి తన నిజస్వరూపమైన ఆత్మకంటె అన్యదృష్టి ఏర్పడుతుంది. రజోగుణ ప్రవృత్తాలైన కామ, క్రోధ, లోభ, మోహమద మాత్సర్యాది దుర్గుణభ్రాంతులు ఉత్పన్నమౌతాయి. మనోవికారాలైన రాగద్వేషాదులు, సుఖదుఃఖాదులు, సర్వ కర్మ కలాపాలు- అన్నీ మాయవల్లే సృష్టింపబడుతున్నాయి. ఆత్మకివన్నీ ప్రతిబంధకాలయాయి. అంచేత, ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులు బోధించిన దాని సారాంశం : ఈ శరీరం నువ్వు కాదని గ్రహించుకో. శరీరమే నువ్వు కాకపోతే, ఇక ఈ ప్రపంచం, సంసారం, దారాపుత్రాదులు, వీటన్నింటి మీద నీకెందుకీ వ్యామోహం? ఈ శరీరమే మరణిస్తూ ప్రపంచాన్ని విడిచిపోతూంటే. వాటిమీద నీకెందుకింత మమకారం. వీట

న్నింటినీ విస్మరించి, వివేకం అలవరచుకో. అసలైనది, శాశ్వతమైనది అయిన భగవత్తత్త్వాన్వేషణలో ప్రవేశించు. నీ నిజస్వరూపం నామ రూపాలులేని ఆత్మస్వరూపం. నివ్వి జడమయమైన దేహానివి కావు. ఈ పరమ సత్యాన్ని అన్వేషిస్తూ, ఆధ్యాత్మిక జీవితంలో అడుగుపెట్టు. మనిషై పుట్టినందుకు నీ జీవితాన్ని సార్థకం చేసుకో.

## (12)

దినయామిన్యౌ సాయం ప్రాతః
శిశిరవసన్తౌ పున రాయాతః
కాలః క్రీడతి గచ్ఛ త్యాయు
స్తదపి న ముఞ్చ త్యాశావాయుః ॥

తాత్పర్యము :

పగలు, రాత్రి, సాయంత్రం, ఉదయం, శిశిర రుతువు, వసంతరుతువు- ఇలాగ దినాలు, రుతువులు తిరిగి తిరిగి వస్తూ పోతూంటాయి. కాలం జీవుల ఆయుర్దాయాల్ని హరిస్తూ, ఇలా ఆటలాడుతూంటుంది కాని మనిషి వివేక హీనుడై, ఆశను మాత్రం విడిచిపెట్టలేకుండా ఉంటాడు.

*వివరణ :*

కాలాన్ని ఎవరూ ఆపలేరు. కాని మనిషి తన సౌకర్యం కోసం, ప్రకృతి ననుసరిస్తూ, చమత్కారంగా కాలాన్ని విభజించాడు. కొంతలు ఏర్పరుచుకున్నాడు. దినాలు, వారాలు, నెలలు, సంవత్సరాలు, దశాబ్దాలు,

శతాబ్దాలు- ఇలా కాలాన్ని విడదీసి, కాలానికి పరిమితులు, కొలతలు ఏర్పరుచుకున్నాడు. అయితే, కాలం మాత్రం నిరంతరంగా సాగిపోతూం టుంది. ఎప్పుడూ అది ఆగేది కాదు. ఉదయం, మధ్యాహ్నం, సాయం త్రం, రాత్రి మళ్ళీ ఉదయం- ఇలా దినాలు గడుస్తూండగా, వర్షాకాలం, శీతాకాలం, వేసవికాలం, మళ్ళీ వర్షాకాలం- ఇలా కాలాలు, అలాగే ఋతు వులు, తిరిగి తిరిగి వస్తూ పోతూంటాయి. సంవత్సరాలు కళ్ళముందు దొర్లిపోతూ మనిషి ఆయుర్దాయాన్ని హరించేస్తూ ఉంటాయి. ఇలా కాల ప్రవాహంలో కొట్టుకుపోవడమే జీవితం. ఎవరి టైము రావడంతో వారు తమ తమ శరీరాల్ని విడిచిపెట్టి మరణిస్తూంటారు. ఇలా జనన మరణా లతో కూడిన జీవులతో కాలం ఆటలాడుతూంటుంది. ఏ జీవి, ఎపుడు ఎక్కడ, ఎలా మరణిస్తాడో ఎవరికీ తెలియదు. అదంతా అవాఙ్మానస గోచరుడైన భగవంతుని నిర్ణయం అనుకుంటారు.

మనిషి తెలివితో కాలాన్ని గమనిస్తే, తప్పక వివేకవైరాగ్యాలు కలుగుతాయి. కాని అలా చెయ్యడు కదా! తన కళ్ళముందర ఎన్నో సంవత్సరాలు దొర్లిపోతున్నా, ఎందరెందరో మరణిస్తూన్నా, ఆశని మాత్రం వదలిపెట్టలేకుండా ఉంటాడు. ఎన్నెన్నో విషయ వాసనలతో, కోరికలతో, సంకల్పాలతో, ఏవేవో చెయ్యాలని అనేక ఆశలతో మన స్సెప్పుడూ నిండి ఉంటుంది. ఇక, వివేక వైరాగ్యాలకోసం ఆ మనస్సులో చోటెక్కడ? వయోవృద్ధుడైనా, ఆయుర్దాయం తరిగిపోతూ, మృత్యు ముఖంలో పడ్డానికి సిద్ధంగా ఉన్నా, ఇంకా ఏదో చెయ్యాలనే ఆశమాత్రం మనిషిని విడిచిపెట్టదు. రోగాలతో తన శరీరం నశించడం కళ్ళారా గమ నిస్తూ కూడా ఆశనీ, అహంకారాన్నీ వదలలేకుండా వాటి ఆధీనంలో నిస్స్వతంత్రుడై ఉంటాడు. ఇలాంటి మూర్ఖుని గురించి చెప్పడానికి ఈ శ్లోకం ఉద్దేశింపబడింది.

## (13)

కా తే కాన్తా ధనగతచిన్తా
వాతులః కిం తవ నాస్తి నియన్తా
త్రిజగతి సజ్జనసంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా ॥

**తాత్పర్యము :**

ఓ చపలుడా! స్త్రీలను గురించి, ధనాన్ని గురించి వ్యామోహంతో ఎందుకిలా చింతన చేస్తావు? నీ మనస్సును నిగ్రహించుకోలేవా? అజ్ఞానంతో ఈ సంసార సముద్రంలో పడి కొట్టుకునేవారికి, ఈ మూడు లోకాల్లోనూ సజ్జన సాంగత్యమనే ఓడ ఒక్కటే తరుణోపాయం.

**వివరణ :**

అజ్ఞానాంధకారంలో వుండే సామాన్య జీవులను హెచ్చరిస్తూ, సంసార సముద్రాన్ని దాటడానికి ఉపాయాన్ని ఈ శ్లోకంలో చెబుతున్నారు. మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం - ఈ నాలుగూ మానవుని అంతఃకరణ. వీటిని అంతఃకరణ చతుష్టయం అంటారు. ఇవి సూక్ష్మ శరీరంలోని ముఖ్యాంగాలు. నిలకడలేని మనస్సు, వివేకంలేని బుద్ధి, శుద్ధి లేని చిత్తం, శరీరమే నేను అనుకొనే అహంకారం- వీటితో మానవులు మనుగడ సాగిస్తూంటారు. విషయాలమీద రాగద్వేషాదుల్ని కలుగజేసి, త్రాటితో మృగాన్ని బంధించినట్టు, ప్రపంచ వ్యామోహమనే పాశంతో, మానవుణ్ణి బంధిస్తుంది మనస్సు. వివేకం కోల్పోయిన బుద్ధి, విషయాల వైపుకే ఎప్పుడూ మనస్సును మళ్ళిస్తూంటుంది. అలాంటి మనస్సు ఇంద్రి

యాలచే ప్రేరేపింపబడుతూ, ఎల్లప్పుడూ విషయసుఖాల వెంట పరుగెడుతూంటుంది. విషయాలలో ప్రధానమైనవి స్త్రీలోలత్వం, ధనవ్యామోహం. నిత్యమూ వీటిని గురించే మానవుని చింత. స్త్రీమోహం ఎలాటిదో యోగవాశిష్టంలో చెప్పబడింది:

పుత్రికా రక్తమాంసస్య కాన్తేయమితి సాదరమ్
స్వదేహ నామ్నా ఽస్థిచయే శ్లిష్యతే మోహకక్రమమ్ ॥

అంటే, రక్తం, మాంసం మొదలైన జడపదార్థాలతో నిండియున్న బొమ్మ ఆకారాన్ని, సుందర స్త్రీగా భావిస్తూ దేహాభిమానంతో ఆ ఎముకలగూడును ప్రీతితో కౌగలించుకుంటాడు. కామాంధకారంయొక్క రీతి ఇలా ఉంటుంది.

పశు, పుత్ర, స్త్రీ, ధనాది పదార్థ జాతమంతా ఆపదలేగాని సంపదలు గావని యోగవాశిష్టంలో ఎంతో విశదంగా బోధింపబడింది.

జడపదార్థదాయకమైన శరీరం, నామరూపాలతో గోచరించే ప్రపంచం, వీటితో సాగే జీవితం ఎప్పటికప్పుడు మార్పు చెందిపోతూ, అశాశ్వత్వమై నశించిపోతున్నవని ఎవరూ గుర్తించుకోరు. తామెవరో, జనన, మరణాలతో సాగే ఈ జీవితం యొక్క యదార్థమేమిటో తెలియని అజ్ఞానంలో దినాలు గడిపేస్తూ, విషయాల తాపత్రయాలతో నిరంతరం మునిగి తేలుతూంటారు వివేకమనేది ఎంతమాత్రం లేనివారై, ఇలా ఈ ప్రపంచంలో శాశ్వతంగా ఉండిపోతూ, విషయసుఖాలు అనుభవిస్తూ ఉందామనే ఆశతో ఉంటారు. అనిత్యమైన ప్రాపంచిక విషయాల్ని గురించే ఎప్పుడూ తలుస్తూంటారు దారాపుత్రాదులు, ధనకనక వస్తువాహనాలు- వీటి సంకల్పాలతో, కోరికలతో అవధుల్లేకుండా ఉంటాయి ఆలోచనలు. ఇలాంటి నికృష్టులైన మానవుల్ని ఉద్ధరించడానికి ఈ శ్లోకం ఉద్దేశింపబడింది.

అజ్ఞానంతో, మూఢత్వంతో సంసారం సాగిస్తున్న మానవునికి, సజ్జన సాంగత్యానికి మించిన తరుణోపాయం లేదు సజ్జనులంటే ఎవరు? వారెక్కడ దొరుకుతారు? వారితో సాంగత్యం ఎలాగ? అనే ప్రశ్నలు, సందేహాలు, ఉదయించవచ్చు. వివేక వైరాగ్యాలు కలిగినవారై అనిత్యమైన ఈ మాయాప్రపంచం యొక్క యదార్థాన్ని తెలుసుకునేందుకు సత్యాన్వేషణచేసే వారే సజ్జనులు. వారు తప్పనిసరిగా యమనియమాలు పాటిస్తూంటారు, శమాదిషట్క సంపత్తి గలిగినవారై ఉంటారు. ఇలాంటి వారు ఈ రోజుల్లో అరుదుగానే ఉంటారు. కాని, అటువంటి మహనీయులు అజ్ఞాతంగా ఉంటూ అక్కడక్కడ తటస్థపడుతూంటారు. వారితో సాంగత్యం మహాఫలప్రదం. విషయ వాసనలను ఒదుల్చుకుని, మనోనిశ్చలత పొందాలంటే, సజ్జనుల సాంగత్యం ఎంతో తోడ్పడుతుంది. ఈ విషయాలన్నీ శంకర భగవత్పాదులు ఇతర శ్లోకాల్లో కూడా సాధకులకు స్పష్ట పరిచారు

## (14)

జటిలీ ముణ్డీ లుంఛితకేశః
కాశాయాంబర బహుకృతవేషః
పశ్యన్నపి చన పశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తం బహుకృతవేషః ॥

**తాత్పర్యము :**

జుట్టు పెంచుకొని జడలు ధరించుట, జుట్టు పూర్తిగా తీసివేసి బోడితల చేసికొనుట, కాషాయ వస్త్రాలు ధరిం

చుట- ఇలాంటివి, ఉదరపోషణకై, అనేక వేషాలు వేసే
మూర్ఖుడు, చూస్తున్నను చూడలేనివాడే అవుతాడు.

వివరణ :

అజ్ఞానానికంతటికీ మూలం, శరీరమే నేను అనుకొనే దేహాత్మ భావం. తానీ దేహాన్ననే అసత్యపు భావం, శరీరం మీద మమకారం పెంపొందిస్తూ, శరీరానికి, ఇంద్రియాలకి సంబంధించిన అనేక వ్యామోహాల్లో మానవుణ్ణి బంధిస్తున్నది. యదార్థంగా మానవుడు మనస్సే కాని శరీరం ఎంతమాత్రం కాదని వివేకంవల్ల విదితమౌతుంది. సుఖదుఃఖాదులన్నీ చిత్తానివేకాని శరీరానివి కావు. కనుక ఈ శరీరానికి ఎన్ని వేషాలు వేస్తే ఏం ప్రయోజనం ఉంటుంది?

మామూలు అజ్ఞానంకన్న ఆధ్యాత్మిక అజ్ఞానం మరీ గడ్డుది. ఇలాంటి అజ్ఞానంతో ఉన్న మూఢులు తమ కృత్రిమ ఆధ్యాత్మికత్వాన్ని ప్రకటించుకుందుకు అనేక వేషాలు వేస్తూంటారు. కొందరు జడలు పెంచుతారు. కొందరు తలలు బోడి చేసుకుంటారు. కాషాయ వస్త్రాలు ధరించి తిరుగుతూంటారు. ఇలా అనేక వేషాలు వేస్తూ వాటికి సంబంధించిన విషయవాంఛల్ని పెంచుకుంటూ, అలాంటి వేషాలు, విషయాలు అన్నీ ఆధ్యాత్మిక సాధన కింద జమకడుతూంటారు. ఇలాంటివన్నీ ఆత్మవంచనకే కాకుండా, అమాయిక ప్రజలను వంచించడానికి కూడా దారి తీస్తాయి. ఇలాంటి మూఢులను గురించి ఈ శ్లోకంలో చెప్పబడింది. అంటే పైకి ఎన్నెన్ని వేషాలువేసి ఆధ్యాత్మికుడుగా నటించినా, ఉదరపోషణ తప్ప ఇంకేమీ సాధించలేనటువంటి మూర్ఖుడుగానే ఉండిపోతాడని అర్థం.

## (15)

**అంగం గలితం పలితం ముండం**
**దశనవిహీనం జాతం తుండమ్**
**వృద్ధో యాతి గృహీత్వా దండం**
**తదపి న ముంచ త్యాశాపిండమ్ ॥**

**తాత్పర్యము :**

వృద్ధాప్యం వచ్చి శరీరం శిథిలావస్థలో ఉన్నా, తలంతా ముగ్గుబుట్టలా నెరిసిపోయినా, పళ్ళన్నీ ఊడిపోయి, నోరు బోసిపోయినా, శక్తిలేక నడవలేని స్థితిలో కర్ర పట్టుకుని అడుగులు వేసే గతి పట్టినా, తనలో కరడు కట్టిఉన్న ఆశనుమాత్రం వదలిపెట్టలేకున్నాడు.

**వివరణ :**

విషయాలపట్ల వాంఛ వీడక, రాగద్వేషాలతో జీవించేవాడు, ఎంత వృద్ధుడైనా వివేకహీనుడై ఉంటాడు. అటువంటి మనిషిని ఆశాపాశంతో చుట్టి బంధిస్తుంది మనస్సు. మనస్సులో జనించే ఆలోచనల ప్రవాహాన్ని పరిశీలిస్తే, మహాచిత్రంగా ఉంటుంది. అసలు మన సంకల్పం లేకుండానే, మనస్సే ఏవేవో ఆలోచనలు చేసేస్తూంటుంది. ఆ ఆలోచనలు ఎక్కడ నుంచి ఉద్భవిస్తున్నాయో, ఎలాసాగుతున్నాయో ఎవరూ యోచించుకోరు. ఒక్కక్షణం మనస్సు ఏ ఆలోచనాలేని నిుకడకలిగి ఉండదు. ఎల్లప్పుడూ మనిషిని ఏదో చెయ్యాలని ప్రేరేపిస్తూండడమే మనస్సుయొక్క స్వభావం. దాంతో ఆలోచనలు, సంకల్పాలు చెలరేగుతాయి. మనిషిని చెయ్యాలని ప్రేరేపించేది మనస్సేకాని, దానివెనుక ఉండేది, అసలైనది, ఆశ. మనస్సు

ప్రేరేపించే విషయాలోచనలన్నింటికీ మూలం ఆశే. ఇది ఎంతో పెద్దది కనుకనే, దీనిని ఆశాపిశాచం అంటారు. ఇది మనిషిని పట్టుకుని చివరిదాకా వదలదు. కనుకనే దీనిని పిశాచంతో పర్ణించారు. ఎంత ఆధ్యాత్మిక జీవితం గడిపినా, సాత్వికత్వాన్ని అలవరచుకున్నా, ఆశను వదుల్చుకోవడం మాత్రం కష్టసాధ్యమే అవుతుంది.

ఎవరైతే ఏ సంకల్పంకాని, ఆలోచనకాని లేకుండా ఉంటారో, వారికి ఆశ వదలిపోయిందని తెలియ వస్తుంది. ధ్యానం (స్వస్వరూపానుసంధానం)లో, ఏసంకల్పం, ఆలోచనా లేకుండా ఎంత సేపు ఉండగలుగుతున్నారు, అనేదే ప్రతివారికి, వారివారి ఆధ్యాత్మిక ప్రగతికి కొలతబద్ద. ఎన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు చదివినా, ఎంత పాండిత్యాన్ని సంపాదించి, ఎన్నెన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు వ్రాసి, ప్రసంగాలు, బోధలు చేసినా, సత్కార్యాలు ఎన్ని చేసినా, మనస్సు అలా సంకల్పశూన్యంగా నిలపడం రాకపోతే, అవన్నీ అనాధ్యాత్మికాలే అవుతాయి. వాటివల్ల ప్రయోజనమేమీ పొందజాలరు. మనోనిగ్రహమే యోగం. ఆధ్యాత్మికం. మనోనిగ్రహం లేనివారు ఆశాపాశబద్ధులై ఉన్నారనే తెలుస్తుంది. ఆధ్యాత్మిక జీవితం సత్కార్యాలు చెయ్యడంవల్లగాని, సంఘసేవల్లాంటివి చెయ్యడం ద్వారాగాని, ఎంతమాత్రం ప్రగతి చెందదు. అవన్నీ ఏదో చెయ్యాలనే ఆశతో మేళమైనవి కాబట్టి, ఆలోచనలకు, సంకల్పాలకు బీజాలౌతాయి కదా ! సంపాదించిన విజ్ఞానం అంతా సంకల్పాల కాష్ఠాలు ఎప్పటికప్పుడు దహించివేస్తూంటాయి. మనిషిలో ఏ ప్రగతీ, మార్పు ఉండదు. యథాప్రకారంగా, తనూ, తన మిథ్యాజ్ఞానం మిగిలి ఉంటారు. కానీ, శరీరం మాత్రం మారిపోతూ, కాలప్రవాహంలో ఇట్టే వృద్ధాప్యం ధరిస్తుంది. రోగాలు వేధిస్తూంటాయి. పళ్ళూడిపోతాయి. మాట వినిపించదు. కర్ర చేతికొస్తుంది. తను పూర్తిగా అజ్ఞానాంధకారంలోనే ఉండిపోయాడు. నిజానికి తాను ఎవరో, ప్రపంచం ఏమిటో, చావుపుట్టుకలంటే ఏమో ఏమీ తెలియని అయోమయంలోనే

ఉన్నాడు. ఆహా ! ఎంత చిత్రంగా మనిషిని ఆశాపాశం బంధించి, భ్రమలో ముంచి, భయంకరమైన మరణంవాత బడవేస్తున్నది?

ఎంతవృద్ధుడైనా ఇంకా ఏదో చేద్దామనే ఆశతో సంకల్పాలు కలిగి ఉంటాడు. మనస్సంతా ఆలోచనలతో నిండి ఉంటుంది. ఒక్క క్షణం నిలకడ ఉండదు. ఇంకా ఏదో సాధించి ఘనతకెక్కాలనే ఆశతో అహంకారిగానే ఉంటాడు. జరిగేవన్నీ తనవల్లే జరిగిపోతున్నాయని భ్రమించి పోతూంటాడు. ఇంతకంటె మూఢత్వం ఏమి కావాలి? నిజంగా తాననే వాడు ఒకడున్నాడా అని ఆలోచించడు. ఎంతో శిథిలావస్థ జెందిన నశించబోయే శరీరమే ఇంకా తానను కొంటూంటాడు. ఆవగింజంత వివేకం కూడా తనకి అబ్బలేదు. జడస్వరూపంతో అసహ్యకరంగా శిథిలమై తనకు గోచరించే తన శరీరం తాను కాదని, తానా శరీరానికి ఆధారమైన అతీతంగా ఉన్న చైతన్యస్వరూపుడనని తెలుసుకోలేకపోయాడు. ఉత్కృష్టమైన మనుష్య జీవితం వ్యర్థం అయిపోయింది.

భగవంతుడు మంచికీ, చెడుకీ కూడా అతీతుడు. అవాఙ్మానస గోచరుడు. మంచిపనులనేవి చెయ్యడంవల్ల కూడా ఆధ్యాత్మికంగా అనర్థమే అవుతుంది. అన్ని కార్యాలకి-మంచికాని, చెడుకాని- సంకల్పాలు బీజాలౌతాయి. అన్ని సంకల్పాలకీ ఆశే మూలం. సంకల్పశూన్యస్థితి పొంది, సమాధిస్థితి సిద్ధించాలంటే, ఇవన్నీ మానసికంగా వదులుకోవాలి. అప్పుడే ఆశాపాశం విచ్ఛిన్నం అవుతుంది. నిశ్చలత్వంతో ధ్యానం సాగుతుంది. ఆత్మానుభూతి త్వరత్వరగా లభ్యమవుతుంది.

## (16)

అగ్రే వహ్నిః పృష్ఠే భానూ
రాత్రౌ చుబుక సమర్పితజానుః
కరతలభిక్ష స్తరుతలవాస
స్తదపి న ముంచ త్యాశాపాశః ॥

**తాత్పర్యము :**

ముందర అగ్నిహోత్రాలు, వెనుకనుంచి సూర్య రశ్మి. రాత్రిసమయంలో మోకాళ్ళమీద గడ్డం. చేతుల్లో భిక్షాటన చేసుకునే పాత్ర. వృక్షాల మొదళ్ళలో నివాసం - ఈ విధంగా జీవితం గడుపుతున్నా, ఆశాపాశం మాత్రం వానిని వదలటంలేదు. అది అతన్ని ముంచెత్తుతూనే వున్నది.

**వివరణ :**

ఎన్ని వదలిపెట్టి, ఎన్ని బాహ్య ఆధ్యాత్మిక చిహ్నాలు ధరించినా, ఆశమాత్రం మనిషిని వీడదు. ఆశ, అహంకారంతో ముడిపడి ఉంటుంది. నేను అనుకొనే అహంకారం ఆవిర్భ విస్తూంటేనే, దాంతోపాటు ఆశకూడా పైకి లేచి మనిషిని బంధిస్తూంటుంది. ఆశకి మూలం అజ్ఞానమే. అజ్ఞాన మంటే దేహాత్మ భావం. శరీరమే నేను అనుకొనే అసత్యపు భ్రాంతి. ఆశ, అహంకారం, అజ్ఞానం - ఈ మూడూ ఒకదాని కొకటి ముడిపడి ఉన్నాయి. అజ్ఞానం పోగొట్టుకుంటే అహంకార భ్రాంతి వీడిపోతుంది. అహంకారమే లేకపోతే ఇంక ఆశ ఎక్కడ నిలుస్తుంది? కనుక, ఎన్ని బాహ్యవేషాలు వేసినా, తల్లకిందులా నిలుస్తూ జపతపాలు చేసినా, అజ్ఞానం పోకుండా ఉంటే, ఆశాపాశం వదలదు. అది పీడిస్తూనే ఉంటుంది.

ఆధ్యాత్మిక సాధన అంతా ముఖ్యంగా మానసికం. కావలసింది మానసిక పరివర్తన. తరువాత బుద్ధివికాసతతో కూడిన సత్యవస్తుధ్యానం. ఇదే అసలైన ఆధ్యాత్మ సాధన అవుతుంది. మనసులో పరివర్తన, వివేకం, వైరాగ్యం మొదలైన భావాలు, సద్గుణాలు పెంపొందకుండా బాహ్యాడంబరాలు, ఎన్నిఉన్నా, ఆధ్యాత్మిక చిహ్నాలు ఎన్ని ధరించినా, సాధకుని సాధన నిష్ప్రయోజనమే అవుతుంది. ఆశాపాశం, అలాంటి సాధకుల్ని వీడదు. ఆశ, అహంకారం, అజ్ఞానం–ఇవి వదలితేనే గాని సాధకుడు తన నిజ స్వరూపానుభూతియైన ఆత్మానుభూతిని పొందలేడు.

## (17)

**కురుతే గంగా సాగరగమనం**
**వ్రతపరిపాలన మథవా దానమ్**
**జ్ఞానవిహీన స్సర్వమతేన**
**ముక్తిం న భజతి జన్మశతేన ॥**

**తాత్పర్యము :**

అజ్ఞానంతో కూడి ఉన్న జ్ఞానహీనుడు, గంగా జలాల్లోనూ, సముద్రాల్లోనూ స్నానాలు చెయ్యడంవల్ల గాని, వ్రతాలు, దానధర్మాలు చెయ్యడంవల్లగాని, జ్ఞానం పొందనిదే, నూరు జన్మలకైనా, ఏ మతం చేతనూ మోక్షాన్ని పొందలేడు.

**వివరణ :**

అజ్ఞానాన్ని పోగొట్టుకుని భగవత్తత్త్వాన్ని అవగాహన చేసుకోవ

డమే మానవ కర్తవ్యం. తత్త్వమస్యాది మహావాక్యాలు "నీవే బ్రహ్మ స్వరూపుడవై యున్నావు" అనే ఆత్మానుభూతికి దారి చూపే, మహత్తర తత్త్వాన్ని బోధిస్తున్నాయి. ఈ పరతత్త్వానుభూతిని పొందడమే జ్ఞానం. ఇదే ప్రజ్ఞానం. ప్రజ్ఞానమే పరబ్రహ్మ స్వరూపం. "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే మహావాక్యం చేసే బోధ ఇదే. ఈ జ్ఞానంవల్లే, దేనివల్లా సాధ్యం కాని, అజ్ఞానపు మాలిన్యాలన్నీ నశించిపోతాయి. అజ్ఞానపు మాలిన్యాలంటే ఆత్మావరోధాలు. అంటే, పంచభూతాలు, ప్రపంచం, శరీరం, పంచప్రాణాలు, పంచేంద్రియాలు, వాసనత్రయం అనబడే దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన, రాగద్వేషాది గుణ సముదాయాలు-ఇవన్నీ ఆత్మావరోధాలే. వీటిని శంకర భగవత్పాదులు "ఆత్మబోధ"లో అజ్ఞానపు కట్టెలుగా వర్ణిస్తారు. ఎంతకాలం అజ్ఞానం ఉంటుందో, అంతకాలం మాత్రమే ఇవన్నీ ఉంటాయి. జ్ఞానాగ్ని రగుల్కొని మండుతోంటే, యీ కాష్ఠాలన్నీ అందులో దగ్ధమై నశిస్తాయి :

> "ఏవమాత్మా రణౌధ్యాన మథనే సతతం కృతే
>
> ఉదితా వగతిర్జ్వాలా సర్వాజ్ఞానేన్ధనం దహేత్॥ (ఆత్మబోధ-42)

అంటే, నిరంతరం ఆత్మధ్యానం (స్వస్వరూపానుసంధానం) తీవ్రతరంగా చెయ్యేటంవల్ల, జ్ఞానాగ్ని రగుల్కొని అజ్ఞానపు కట్టెలను పూర్తిగా దహించి వేస్తుంది.

జ్ఞానాగ్ని రగుల్కొడానికి ఇంధనం ఆత్మానాత్మ వివేకం. అంటే, గోచరించే జడస్వరూపాలైన లోకం, శరీరాలు, పంచేంద్రియాలు అంతఃకరణ చతుష్టయం, మనఃస్చిత్త బుధ్యహంకారాలు, అన్నీ మిధ్యాస్వరూపాలు, ఆరోపితాలు, అసత్యాలు అని నిశ్చయించుకుంటూ, లోపల, వెలుపల, అంతటా నిండి, సర్వావస్థల్లోనూ ప్రకాశిస్తూండే చైతన్య స్వరూపమైన బ్రహ్మాన్ని నేనే అయివున్నానని అనుభూతి చెందడమే జ్ఞానం.

ఇలాంటి ఆత్మజ్ఞానం ఉదయిస్తేనే, దేహాత్మభావం వదలిపోతుంది. అనాత్మ ప్రవృత్తులన్నీ వట్టి భ్రాంతులేకాని యదార్థాలు కావని విదితం అవుతుంది. అవన్నీ స్వప్న సమానంగా ఆ జ్ఞాని గ్రహిస్తాడు. సమ్యగ్జ్ఞానమనే ఇలాంటి తెలివి సాధించాలంటే నిరంతర దృఢాభ్యాసం అవసరం. ఈ జ్ఞానం పుస్తక పఠనంవల్లా, పాండిత్యం వల్లా సాధ్యమయేది కాదు. గ్రంథాలవల్ల గ్రహించేదంతా ఆధ్యాత్మిక విషయం (Spiritual informa tion). ఇది మానసిక జ్ఞానం. మానసిక జ్ఞానం అంతా మిథ్యాజ్ఞానం అవుతుంది. మనస్సు అజ్ఞానంవల్లా, అహంకారం వల్లా జనిస్తుంది. విషయ వాసనలచే ప్రేరేపింపబడి, ఇంద్రియాలవల్ల చలిస్తూంటుంది. చంచలమే దాని స్వభావం. అలాంటి మనస్సు గ్రహించేది అధ్యాత్మిక జ్ఞానమెలా అవుతుంది? ఆధ్యాత్మిక జ్ఞానం అంటే ఆత్మజ్ఞానం. ఎన్ని అధ్యాత్మిక గ్రంథాలు చదివి, ఎంత ఆధ్యాత్మిక విషయం తెలుసుకున్నా, యమనియమాలతో సక్రమమైన సాధన చెయ్యందే, ఆవగింజంత ఆత్మజ్ఞానం కూడా కలగదు.

జ్ఞానం సాధనవల్ల జనించి, సాధనవల్ల పెంపొందుతూ, సాధనవల్లే లక్ష్యసిద్ధియైన ఆత్మానుభూతిలో లయించిపోతుంది. ఇది ఇండుపుకాయ గంధం లాంటిదని శంకర భగవత్పాదులు ఎంతో చమత్కారంగా "ఆత్మబోధ"లో ఇలా చెబుతారు :

"అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసాద్ వినిర్మలం

కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం తకరేణువత్।(ఆత్మబోధ-5)

అంటే, ఇండుపుకాయ గంధం (లేకపొడి), మట్టినీళ్ళను పరిశుభ్రపరచి తాను అదృశ్యమౌతుంది. అలాగే, జ్ఞానం నిరంతర సాధనవల్ల దేహాత్మబుద్ధి కలిగి, అజ్ఞానపు మాలిన్యంతో ఉన్న, జీవుణ్ణి పవిత్రుని గావించి తాను మాయమౌతుంది.

## (18)

సురమందిర తరుమూల నివాసః
శయ్యా భూతల మజినం వాసః
సర్వపరిగ్రహ భోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః ? ॥

**తాత్పర్యము :**

దేవాలయాలు, చెట్లమొదళ్ళు, ఇలాంటివి ఎవరికి నివాస స్థానాలుగా ఉంటాయో, నేలయే పానుపుగా చేసుకుని ఎవరు హాయిగా పరుంటారో, ఎవరికి కృష్ణాజనమే వస్త్రమౌ తుందో, ఎవరు తమ పరివార మందరినీ వదలివేయగలిగి ఉంటారో, అలాంటి మహనీయులకి, ఇంతటి వైరాగ్యం, సుఖాన్ని ఎందుకు కలుగజెయ్యదు ?

**వివరణ :**

ఆత్మ సాక్షాత్కారం పొందడానికి ఎంతో తహతహ లాడిపోతూ కొందరు సాధకులు అక్కడక్కడ అరుదుగా తారస పడుతూంటారు. వారు సర్వస్వాన్ని పరిత్యజించి, సక్రమమైన సాధనాభ్యాసం చేస్తూ, సత్యము, శాశ్వతము, ఆనందమయము అయిన, ఆపరతత్వాన్ని ఈ జన్మలోనే పొందాలనే అఖండమైన ఆవేదన కలిగి ఉంటారు. శీఘ్రంగా సాధన ఫల వంతమై, లక్ష్యసిద్ధి కలగాలంటే, ఇలాంటి గాఢమైన ముక్తవాంఛ ఉండాలి. దీనినే తీవ్రముముక్షత్వం అంటారు. ఇలాంటి ముముక్షువులు ఎలా తీవ్ర వైరాగ్యంతో ఉంటారో శంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో చెబుతున్నారు.

అన్నింటికన్నా అభయమైనది వైరాగ్యం. ప్రపంచంలో అన్నీ భయానకమైనవే.

"భోగేరోగ భయం, బలేరిపు భయం, విత్తేన్నృపాలాద్భయం, మానేదైన్య భయం, కులేచ్యుతి భయం.........సర్వంవస్తు' భయాన్వితం నృణాం వైరాగ్యమేవా భయం" అని శాస్త్రంలో చెప్పబడింది. అంటే భోగాలలో నిమగ్నుడై ఉన్నవాడు, రోగం వస్తుందేమోనని భయబడి పోతూంటాడు. ఎంతో బలంకలవాడు, తనకంటె ఎక్కువ శక్తికలవాడిని చూసి భయపడుతూంటాడు. ధనవంతుడికి రాజు (ప్రభుత్వం) అంటే మహాభయం. పరువు ప్రతిష్టలు గలవాడు, అవి ఎక్కడ పోతాయో, తానెక్కడ అప్రతిష్ట పాలౌతాడో అనే భయంతో ఉంటాడు. మంచికులంలో ఉన్నవాడు, తనకెక్కడ కులభ్రష్టత్వం కలుగుతుందోనని భయపడిపోతూ ఉంటాడు. ఇలా యీ ప్రపంచంలో అన్నీ భయానకంగా ఉంటాయి. వైరాగ్యమొక్కటే నిర్భయమైనది.

ప్రాపంచిక విషయాల్ని పరిత్యజించడం, ముందర మహాకష్టమని పిస్తుంది. కాని క్రమ క్రమంగా నిత్యానిత్యవస్తు వివేకంతో, ఆత్మవిచారణ చేస్తూ, విషయాల్ని వదిలేస్తూంటే, మహాసుఖం కలుగుతుంది. యోగ వాశిష్టంలో విషయత్యాగాన్ని గురించి చెప్పిన ఈ క్రింది శ్లోకాలు కూడా గమనార్హం :-

కిమన్యైః శాస్త్రసందర్భైః క్రియతా మిద మేవ తు
యద్యత్స్వాద్వీహ తత్సర్వం దృశ్యతాం విషవహ్నివత్ ॥

అంటే, శాస్త్రసంబంధాలైన ఇతర విషయాలవల్ల ఏమి ప్రయోజనం? ఈ ఒక్క విషయం ఆచరిస్తే చాలు. ఈ ప్రపంచంలో ఏదేది రుచికరంగా

ఆకర్షణీయంగా ఉంటున్నట్లు తోస్తుందో, దానినంతటినీ విషంలాగ, అగ్ని లాగ చూడాలి. (దానిపట్ల అంతటి విముఖతతో ఉండాలి).

విషమా విషయా భోగాః ప్రవిచార్య పునః పునః
ఉపరిష్టాత్పరిత్యజ్య సేవ్యమానాః సుఖావహాః ॥

నిత్యానిత్య వస్తువివేకంతో విచారణ చెయ్యందే, విషయాల్ని త్యాగం చెయ్యడం అత్యంత కష్టసాధ్యం. అందుచేత మళ్ళీ మళ్ళీ వివేకంతో విచారణ చేస్తూ, క్రమక్రమంగా విషయ వాసనలని, భోగాలని త్యజిస్తే, చివరికి ఆ విషయ త్యాగం అత్యంత సుఖాన్నీ, శాంతిని కలుగజేస్తుంది.

ఆత్మ సాక్షాత్కారానికి త్యాగం అతి ముఖ్యం. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అత్యల్పమైన ఇంద్రియ సుఖాల్ని వివేకవైరాగ్యాల్తో త్యజిస్తే, అనంతమైన ఆత్మసుఖం లభిస్తుంది.

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేనఅమృతత్వమానశుః" అని కైవల్యోపనిషత్తులో చెప్పబడింది. అంటే, కర్మచేతగాక, సంతానముచేగాక, ధనముచేతగూడ గాక, కేవలము త్యాగము చేతనే అమృతత్వము సిద్ధిస్తుంది. "త్యాగ ఏవహి సర్వేషాం మోక్షసాధన ముత్తమం" అంటే మోక్షసాధనములలో త్యాగమే సర్వోత్తమమని శృతులు బోధిస్తున్నాయి.

## (19)

యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగవిహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నందతి నందతి నందత్యేవ ॥

**తాత్పర్యము :**

ఆత్మజ్ఞానపరుడైన ఎవని చిత్తం, తన యదార్థ స్వరూపమైన బ్రహ్మమందు నిరంతరం నిమగ్నమై ఉంటుందో, ఆ మహానుభావుడు ఎప్పుడూ ఆ ఆనందానుభవంలో సుఖంగా ఉంటాడు. అటువంటివాడు యోగాభ్యాస సంపన్నుడైనా, లేక భోగాల్ని అనుభవిస్తూండేవాడైనా, సత్సంగం కలవాడైనా, ఏసాంగత్యం లేనివాడైనా, ఎల్లప్పుడూ ఆ బ్రహ్మానందానుభవంలోనే ఉంటాడు.

**వివరణ :**

భగవంతుడొక్కడే ఉన్నాడు. వేరేదీ లేదు. (ఏకమేవా ద్వితీయం బ్రహ్మ) అనేది ఆదిశంకరులు బోధించిన అద్వైత సిద్ధాంతము. బ్రహ్మమినహా సర్వేతరము మిథ్యయే. అంటే యదార్థంగా లేనటువంటిదే. సర్వోత్కృష్టమైన ఈ తత్వాన్ని అవగాహన చేసుకుని, బ్రహ్మేతరమైన మిథ్యాస్వరూప శృంఖాలన్నిటి నుంచి. విముక్తి పొందినవాడు ధన్యుడు. నిరంతరం ఆజ్ఞానామృతాన్ని ఆస్వాదిస్తూ, బ్రహ్మానందానుభవంలోనే ఉండిపోతాడు. ఎందుచేతనంటే. తాను దేహాతీత, నాశరహిత, నిత్య, సత్యస్వరూపుడిననే భావం అతనికి అనుభూతి అయింది. మిధ్యాస్వరూపమైన దేహాది దృశ్య ప్రపంచ భ్రాంతి, ఇక అతనికి లేదుకదా ! ఆత్మస్వరూపుడైన తనకంటె ఇతర వస్తువేదీ అతనికింక గోచరించదు. బ్రహ్మేతరమేదీ స్ఫురింపదు. సర్వసమత్వం కలిగి. పరమ శాంతుడై, అనుక్షణం తత్వజ్ఞానంతో భాసిల్లుతూంటాడు. అతనికిక నేను, నీవు, అది, ఇది అన్న భేద బుద్ధి ఉండదు. పరమాత్మ తప్ప మరొకటి అతనికిలేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్న సత్యానుభూతిని పొందినాడు. పాంచ

భౌతిక అస్తిత్వం అతనికి వదలిపోయినది. ఇలాంటి బ్రహ్మ జ్ఞానస్వరూపుణ్ణి గురించి ఈ శ్లోకంలో చెప్పబడింది.

యదార్థ విషయం తెలుసుకున్న తరువాత, అంటే, తన, నిజస్వరూపం ప్రకటితం కావడంతో, అజ్ఞాన సంశయాలన్నీ పటాపంచలౌతాయి. దృశ్యాదులన్నీ మిథ్యాస్వరూపాలనే గ్రహింపు కలుగుతుంది. అలాంటి అత్యున్నత స్థితిని పొందిన మహనీయునికి సత్సంగం, సన్మార్గం, యోగం, భోగం- ఇవన్నీ అప్రధానమైన విషయాలు. ఇవన్నీ అతనికి కలిగిన భ్రాంతులేకాని యదార్థాలు కావని అతనికి తెలిసిపోయినది.

జీవన్ముక్తుని ఆనందానభూతిని వెల్లడిస్తూ అలాంటి పరతత్త్వవేత్త భోగాలకికాని, సంగాలకిగాని, యోగానికిగాని అన్నింటికీ అతీతుడై ఉంటాడని ఈ శ్లోకంలో వివరింపబడింది.

## (20)

భగవద్గీతా కించి దధీతా
గంగాజలలవ కణికా పీతా
సకృదపి యేన మురారి సపర్యా
క్రియతే తస్య యమేన న చర్చా ॥

**తాత్పర్యము :**

ప్రతిదినము భగవద్గీత కొంత భాగమైనను పారాయణ చేస్తూ, పవిత్రమైన గంగాజలమును కొంచం పానం చేస్తూ, ఎవరు ఒకసారియైనను మురారియైన భగవంతుని

సహృదయంతో సేవిస్తారో, అటువంటివారు ఇక యమ
ధర్మరాజుతో చర్చ చెయ్యడం సంభవించదు.

*వివరణ :*

ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత. ఉపనిషత్తులు గోవులైతే, వాటి పరిశుద్ధమైన పాలే భగవద్గీత అని చెప్పబడింది. కనుక భగవద్గీత పఠిస్తూ, అవగాహన చేసుకుని, ఆచరణలో పెడితే, ఆత్మ వికాసం కలిగి ముక్తిని పొందడం, నిస్సంశయం. ఇక ఉపనిషత్తుల్లాంటి ఇతర గ్రంథాలను శ్రమతో పఠించవలసిన అవసరం ఉండదు.

భక్తి, జ్ఞాన, వైరాగ్య తత్త్వాలన్నిటినీ భగవద్గీతలో అర్జునునికి శ్రీకృష్ణుడు బోధించాడు. నిష్కామకర్మ యొక్క ప్రాశస్త్యాన్ని విపులంగా వివరించాడు. నిత్యానిత్య వస్తువివేకం ఎలా కలుగుతుందో, జ్ఞానం యొక్క ఉత్కృష్టత ఎటువంటిదో, ఆత్మస్వరూపాన్ని పొందాలంటే జీవితాన్ని ఎలా మార్చుకుని ఏమేమి చెయ్యాలో, అన్నీ భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ వివరించాడు. మనిషికి శరీరంలో హృదయం ఎటువంటిదో, ఆధ్యాత్మిక శాస్త్రాల్లో భగవద్గీత అటువంటిదని చెబుతారు. ప్రతిదినం భగవద్గీత ఏమాత్రం పఠించినా దానివల్ల ఎంతో ఫలితం ఉంటుందని శంకర భగవత్పాదులు బోధిస్తున్నారు. అలాగే, గంగాజలం యొక్క ప్రాశస్త్యతను కూడా చెబుతున్నారు. జీవనదులన్నింటిలోను గంగానది అతి పవిత్రమైనదని అందరికీ తెలిసిన విషయమే. పరమ శివుని జటాజూటంలోంచి బయలుదేరి ప్రవహించే పవిత్ర గంగాజలాన్ని, ఏ కొంచం తాగినా మనిషిలోని మాలిన్యాలన్నీ నశించి పవిత్రుడౌతాడు. షడూర్మిరహితుడైన శివుని సాక్షాత్కారం పొందుతాడు. ఇలా ప్రతిదినం

భగవద్గీత పారాయణచేసి, జ్ఞాన బోధితుడై, గంగాజలాన్ని పానంచేసి, పవిత్రుడై, సత్వ, రజ, స్తమో గుణాలను విడిచిన దైవజిజ్ఞాసుడు, భగవంతుని సేవలో నిమగ్నుడౌతే, ఇంకేం కావాలి? అలాంటి వాని మానవ జన్మ సార్థకం అయినట్టే. అలాంటి మహానీయుడు, శరీర భ్రాంతి వదలిన వాడై, తన యదార్థ, సత్‌చిదానందమయ స్వరూపమైన ఆత్మను పొందుతాడు. దేహాత్మబుద్ధి నశించి పోవడంచేత, ఇక జరామరణాలు ఆ మహాత్మునకు కలుగవు. అంటే, భగవత్తత్వాన్ని అవగాహన చేసుకుని, తన నిజ స్వరూపం అయిన ఆత్మను అనుభూతి పొందిన మహానుభావుడు, జరామరణాలకు అతీతుడౌతాడు. ఇక యమధర్మరాజుతో అటువంటి వానికి నిమిత్తం ఉండదని శంకర భగవత్పాదులు చమత్కారంగా చెబుతున్నారు.

## (21)

పున రపి జననం పునరపి మరణం
పునరపి జననీజఠరే శయనమ్
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయాఽపారే పాహి ! మురారే ! ॥

తాత్పర్యము :

జనన మరణాలు తిరిగి తిరిగి వస్తూపోతూంటాయి. పుట్టడం, చావడం, తిరిగి తల్లిగర్భంలో ప్రవేశించి ఉండడం, మళ్ళీ పుట్టడం - ఇలా హద్దులేకుండా బహుదుస్తరంగా ఉంటుంది ఈ జనన మరణ రూప సంసారం. కనుక, నామీద కృపాకటాక్షాలతో, ఈ సంసారం నుండి నన్ను రక్షింపుమా ! ఓ మురారీ !

**వివరణ :**

సంసారం బహు దుఃఖకరమైనది. దాని తాపత్రయ క్లేశాలవల్ల శాంతి నశిస్తుంది. సంసారానికి మూలం అజ్ఞానం. అంటే దేహాత్మభావం-దేహమే నేను అనుకొనే అసత్యపు భ్రాంతి. జీవుడంటే నేననుకునే తలంపే. ఈతలంపు స్థూలరూపం దాలుస్తే, శరీరాన్నీ, ఇంద్రియాలనీ అవహిస్తుంది. ఇదంతా భ్రమ తప్ప యదార్థం కాదని సర్వోత్కృష్టమైన మన వేదాంత తత్త్వం ఘోషిస్తూంది. ఈ మిథ్యాభావనవల్లే అన్ని కర్మలు చేస్తూ జీవుడు రాగద్వేషాలతో, దుఃఖాలతో బాధ పడుతూంటాడు.

కర్మలు ఎందుకు చేస్తారు? రాగద్వేషాదులవల్ల మనస్సు ప్రేరే పింపబడి పుణ్య, పాప, మిశ్రమ కర్మలన్నీ చేస్తూంటారు. ఈ కర్మకాండ కంతటికీ మూలం అజ్ఞానం. తానెవరో తెలియని అవివేకం. ఏ మాత్రం వివేచనతో విచారించినా, తానీ శరీరం కాదని విదితం అవుతుంది. శరీరం వట్టి జడపదార్థ సమ్మేళనం. తానెప్పుడూ శరీరానికి భిన్నుడే. శరీరం, నామరూపాలు లేని ద్రష్ట అయిన తనచేత తెలిసికొనబడుతూండే అవయవ ములతో కూడిన బొమ్మలాంటిది. అలాంటి శరీరాన్ని తానుగా భావించు కోడం అవివేకం కాక ఏమౌతుంది? ఈ అవివేకం వల్లే సంసారం కలగ డం. యదార్థంగా సంకల్ప వికల్పాలే సంసారం. వీటి పరిణామాలే బాహ్యక్రియలరూపం దాలుస్తూంటాయి. మనిషికి దుఃఖం, అశాంతి కలి గిస్తూంటాయి.

మన యదార్థ స్వరూపం నామరూపాలు లేని ఆత్మస్వరూపం. అది ఆకాశతుల్యం. నామరూపాలు లేకపోతే, ఇక జరామరణాలు ఎలా సంభవిస్తాయి? యదార్థంగా మనకి చావుకాని, పుట్టుకకాని లేనేలేదని వివేకజ్ఞానంవల్ల తెలిసిపోతుంది. అవన్నీ శరీరధర్మాలు. శరీరం మనం

కాదని తెలిసికొన్నప్పుడు- ఆ జ్ఞానం నిస్సందేహంగా పొందుతే- మనకిక జరామరణాల భ్రాంతి వదలిపోక ఏమౌతుంది? అపుడు మనకి నిర్భయత్వం ప్రాప్తిస్తుంది. అజ్ఞానం - అంటే దేహాత్మ భావం-ఉన్నంతకాలం జరామరణాల భయభ్రాంతి తప్పదు. అంటే పుట్టడం, చావడం, మళ్ళీ పుట్టడం, మళ్ళీచావడం-ఇవి తప్పవు. ఇలాంటి జననమరణ ప్రవాహంలో మనిషి కొట్టుగుపోతూ, సంసారబాధల్ని అనుభవిస్తూ, అనేక జన్మలు ఎత్తుతూంటాడు. ఇలాంటి దుఃఖ భూయిష్టమైన సంసారాన్ని గురించి చెబుతూ, దానినుంచి విముక్తికలుగ జెయ్యమని ఆది శంకరులు ఈ శ్లోకంలో దైవాన్ని సంబోధిస్తూ ప్రార్థింమకోమని బోధించారు.

అన్యమెల్లని భక్తితో, వైరాగ్యం కలిగి మురారిని (భగవంతుని) ప్రార్థనాదులతో సేవిస్తే, తప్పక సంసార భ్రాంతి వదలిపోతుందట. నిజానికి, ఈ సంసారం శరీరం, ప్రపంచం, అన్నీ అసత్యమైన భ్రమలే కాని, ఇవి యదార్థంగా లేనివేనని, వేదాంతశాస్త్రం చెబుతున్నది. ఎప్పుడూ ఒక్కలా ఉండేది ఆత్మస్వరూపమే. లేనివన్నీ శరీర ప్రపంచాదులు. అవన్నీ మిథ్యా స్వరూపాలు కాబట్టి, అవి చలిస్తూంటాయి. వస్తూంటాయి. పోతూంటాయి. సదా మార్పుఅు చెందుతూంటాయి. వీటన్నిటినీ యదార్థంగా, ఆత్మగా మనస్సు పోషిస్తోంది. అందుకే ఈ సంసారం.

మిథ్యా స్వరూపాలైన శరీర, ప్రపంచాదుల్ని ఎన్నుకుని, యదార్థమైనది, నిత్యానందమయమైనది అయిన నిజస్వరూపాన్ని (ఆత్మని) విస్మరించడం వల్లనే సంసార తాపత్రయం, దుఃఖం వచ్చిపడ్డాయి. శరీర ప్రపంచాదులు, సంసారం అన్నీ ఉన్నది మనస్సులోనే. మనస్సులేని నిద్రావస్థలో మనకివేమీ లేవు కదా! మనస్సు విజృంభించే జాగ్రదావస్థలో మాత్రమే ఇవన్నీ పీడిస్తున్నాయి. అవన్నీ కావాలని మనం కోరి తెచ్చుకున్నవే. నిజంగా అవన్నీ భ్రాంతులే. ఈ యదార్థ విషయాన్ని వేదాంత

శాస్త్రం తరచి తరచి చెబుతున్నది. వివేక విజ్ఞానాలవల్ల ఈ విషయం తప్పక అవగాహన అవుతుంది. ఇలాంటి అవగాహనే జ్ఞానం. ఈ జ్ఞానం కేవలం పుస్తక పఠనంవల్లగాని, ఉపన్యాసాలు వినడంవల్ల గాని కలుగదు. అది అనుభవైక వేద్యం. సాధన సంపత్తివల్లనే సాధ్యం అయేది. భగవంతుని మీద అచంచలమైన విశ్వాసము, భక్తి కుదిరి, ధ్యానాభ్యాసం చేస్తే, ఆ అనుభవైక వేద్యం సాధ్యం అవుతుంది. అజ్ఞానం, అవివేకం నశిస్తాయి. ఇవి నశించడానికే సర్వసాధనలు నిర్దేశింపబడ్డాయి. వీటిని నిర్మూలించుకోడమే, భగవదనుభూతిని పొందడం. మన నిజస్వభావమైన ఆ నామరూపాలులేని అఖండానంద స్వరూపాన్ని తిరిగి పొందడం. ఈ భావాలన్నీ ఈ పవిత్ర శ్లోకంలో ఇమిడి ఉన్నాయి.

(22)

రథ్యా కర్పట విరచిత కంథః
పుణ్యాపుణ్య వివర్జితపంథః
యోగీ యోగనియోజిత చిత్తో
రమతే బాలోన్మత్తవదేవ ॥

తాత్పర్యము :

చినిగిపోయి వీధిలో పారవేసిన గుడ్డపీలికలతో చేసిన బొంత ధరిస్తాడు. ఇది పుణ్యమని ఇది పాపమని అనుకొనే అజ్ఞానపు మానసిక బంధాలేవీ లేనివాడై ఉంటాడు. అలాంటి యోగి, సాధనవల్ల నియమించబడిన నిశ్చల చిత్తం కలిగి, ఆత్మానుభవంలో పరిపూర్ణానందా

మృతాన్ని గ్రోలుతూ, ఒకసారి చిన్న పిల్లవానివలెను, వేరొకసారి పిచ్చివానివలెను ఆటలాడుతూ ఆనందాను భవంతో సంచరిస్తూంటాడు.

**వివరణ :**

జీవన్ముక్తుడైన మహాపురుషుడు దేహానికీ, ప్రపంచానికీ అతీతుడై పరమాత్మ స్వరూపంలో నిమగ్నుడై, ఎలా సంచరిస్తూంటాడో, ఈ శ్లోకంలో చెప్పబడింది. అలాంటి మహానుభావుడు, శరీర ప్రపంచాదుల దృష్టి ఎంతమాత్రం లేనివాడై ఉంటాడు. అహంకార మమకారాలు కాని, రాగద్వేషాదులు కాని, పుణ్యపాపాలు కాని, ఇలాంటి మనోవికారాలేవీ అత నికి ఉండవు. స్థూలసూక్ష్మ శరీరభ్రమలు, మనోమయ చైతన్యంయొక్క భ్రాంతి భావాలు, పూర్తిగా అతనికి వదిలిపోయాయి. అన్నీ విడిచినవాడై తనకు తానే మిగిలి, ఆత్మ స్వరూపుడుగా, జీవన్ముక్తునిగా భావిస్తూ సంచరిస్తూంటాడు.

ఉన్నది అంతిమ దివ్యానుభమైన ఆత్మానంద మొక్కటే వేరేదీ లేదు. ఈ దివ్యానుభవమే మన యదార్థ స్వరూప చైతన్యము. ఇదే అద్వైత సిద్ధాంతము. ఈ సిద్ధాంతాన్ని శంకర భగవత్పాదులు అనేక గ్రంథాల్లో వివరించి బోధించారు.

అహంకారం, అజ్ఞానం నిశ్శేషంగా తొలగిపోయిన వెంటనే, మన స్వస్థితి మనకి కలుగుతుంది. మనస్వస్థితి మనం పొందడమే జ్ఞానం. అది నిత్యానంద స్వరూపమైన స్వయం ప్రకాశం. అలా స్వస్థితి పొందిన వానికి సంకల్ప వికల్పాలుండవు. పరతత్వబోధలో స్థిరత్వం కలగడం వల్ల, ఆత్మస్వరూపుడైన తనకంటె ఇతర వస్తువేదీ గోచరింపదు. సర్వం ఏకైక స్వరూపుడైన తానే. ఇదే జీవన్ముక్త స్థితి.

ఇలాంటి జీవన్ముక్త స్థితిని పొందిన మహాత్ములెలా ఉంటారో శంకర భగవత్పాదులు "వివేకచూడామణి", "సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహం" మొదలైన ఉత్తమ గ్రంథాల్లో కూడా విపులంగా పేర్కొన్నారు. ఆ గ్రంథాలలోని యీ క్రింది శ్లోకాలు ఈ సందర్భంలో గమనార్హం :

> భిక్షాహారస్య మదైన్యం భైక్ష్యమశనం పానం సరిద్వారిషు
> స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితిరభీర్నిద్రా శ్మశానే వనే
> వస్త్రంక్షాళన శోషణాది రహితం దిగ్వాస్తు శయ్యామహీ
> సంచారో నిగమాన్తవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి ॥
> (వి. చూ. 539)

జీవన్ముక్తులైన మహాపురుషులు ఎలాంటి మనోవికారాలు లేక, రాగద్వేషరహితులై, నిర్భయులై వుంటారు. భిక్షాన్నం భుజిస్తారు. నదులలోని ఉదకాన్ని పానం చేస్తారు. స్వతంత్రంగా, నిర్భయంగా, నిర్బంధరహితులై విహరిస్తారు. తోటల్లోకాని, స్మశానాల్లోకాని పరుంటారు. వారికి దిక్కులే వస్త్రాలు. (దిగంబరులు). భూమియే పానుపు. శరీర ప్రపంచాదుల కతీతులైనందున, ఎల్లప్పుడూ బ్రహ్మమునందే రమిస్తూ, వేదాంత వనవీధుల్లో విహరిస్తూంటారు.

## (23)

> కస్త్వం ? కోఽహం? కుత ఆయాతః ?
> కా మే జననీ ? కో మే తాతః ?
> ఇతి పరిభావయ సర్వం మసారం
> విశ్వం త్యక్త్వా స్వప్నవిచారమ్ ॥

**తాత్పర్యము :**

నువ్వెవరు? నేనెవడను? మనమెక్కడనుండి వచ్చి నాము? నాకు తల్లి ఎవరు? తండ్రి ఎవరు? విచారించి చూస్తే ఇవన్నీ స్వప్నతుల్యమైన ప్రపంచానికి సంబంధించిన మిథ్యాస్వరూపాలు. సారహీనమైన వీటిని లేనివిగా భావించి వదలివేయుము.

***వివరణ :***

ఆత్మసాక్షాత్కారం సత్వరంగా కలుగజెయ్యడానికి, శంకర భగవత్పాదులు ఈ పవిత్ర శ్లోకాన్ని ముముక్షువులకు ప్రసాదించారు. ప్రపంచపు మిథ్యత్వాన్ని ఎలా విచారించుకుని, రూఢి చేసుకుని, దానిని నిస్సారమైన ఎండమావిలాంటిదని విసర్జించాలో, ఈ శ్లోకంలో సూచించ బడింది. ఆత్మ మిథ్యా స్వరూప దృశ్య ప్రపంచాకారుడు కాదు. దృశ్యాలన్నీ మనోకల్పితాలు ఇంద్రియ గోచరాలు. మిథ్యాస్వరూపాలు. ఈ దృశ్య విషయాలన్నింటి నుంచి విముక్తి కలుగుతేకాని, అసత్తైన విషయ శూన్యమైన ఆత్మవైపుకు మరలటం సంభవింపదు.

మానవుని మనుగడ మూడవస్థలతో ప్రతిదినం సాగుతూంటుంది. ఇవే జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలు నిద్రానంతరం కలిగే మెలకువ అనబడేదే జాగ్రదావస్థ. ఈ జాగ్రదావస్థలోకి రాగానే, ముందు అహంకారం ఉద్భవిస్తుంది. వెంటనే మనస్సు విజృంభించి, ఇంద్రియాలను ఆవహించి ప్రపంచాన్ని దర్శిస్తుంది. అలాగే స్వప్నావస్థలో కూడ, భోక్త, భోగ్య, భోగ రూప ప్రపంచాన్ని మనస్సు సృజిస్తుంది. ఈ జాగ్రత్ స్వప్నావస్థలు రెండూ మనోకల్పితాలే కాని, వాస్తవాలు కావని శిష్యునికెంతో విశదంగా శంకర భగవత్పాదులు, వివేకచూడామణిలో ఈ విధంగా బోధించారు :

స్వప్నేర్థ శూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాది విశ్వం మన ఏవ సర్వం
తథైవ జాగ్రత్యపినో విశేష
స్తత్సర్వమేతన్మనసో విజృంభణమ్ ॥ (వి. చూ. 172)

అంటే. స్వప్నావస్థలో గోచరించే స్వప్న ప్రపంచం, జాగ్రదావస్థలో పంచేంద్రియాలవల్ల తెలియబడుచుండే దృశ్య (పాదార్థిక) ప్రపంచం- రెండూ సమానమైనవే. ఈ రెండవస్థల్లోను కానవచ్చే విశ్వం అంతా మనోవిజృంభణమే కాని యదార్థం కాదు.

ప్రపంచం యొక్క అసత్యత్వాన్ని శంకర భగవత్పాదులు చమత్కారమైన ఉపమానాలతో సుస్పష్టంగా అనేక గ్రంథాల్లో వివరించారు. జాగ్రదావస్థలో ప్రత్యక్షంగా ఎదురుగా ఉంటున్న ప్రపంచాన్ని, అసత్యమైనది, యదార్థంగా లేనిది అంటే సామాన్యులకు ఆశ్చర్యమే కలుగుతుంది. నమ్మకం ఏర్పడదు. ప్రపంచకపు అసత్యత్వాన్ని తెలుసుకోవాలంటే, ఎంతో కృషి చెయ్యవలసి వస్తుంది. ఆ కృషి అందరికీ ఫలించక పోవచ్చు. యమనియమాదులు పాటిస్తూండే సాధన సంపన్నుడైన వివేకవంతుడికి, జగత్తు మిథ్యగా అవగాహన అవడం నిస్సందేహం. ఇలాంటి సాధకులు అరుదుగా ఉంటారు.

అజ్ఞానంవల్ల అహంకారం (అంటే, దేహాత్మభావం), అహంకారంవల్ల మనస్సు, మనస్సు విజృంభించడంవల్ల ఇంద్రియ చలనం, ఇంద్రియాలవల్ల ప్రాపంచిక గోచరం- ఇలా జాగ్రదావస్థలో ప్రపంచం గోచరిస్తూంటుంది. జడమయమైన శరీరం తానేనని, మనఃకల్పితమైన ప్రపంచం యదార్థమేనని అపోహపడి పోతాడు. భయంకరమైన సంసారపు భ్రమ అవహిస్తుంది. తానెవరో, తన నిజస్వరూపం ఏదో తెలుసుకునే అవకాశం లేక, జనన మరణాలతో కూడిన సంసారచక్రంలో తిరుగుతూంటాడు.

ఇంద్రియాలచే జాగ్రదావస్థలో భాసిస్తున్న జగత్తంతా మనో కల్పితమై గంధర్వ పట్టణంలాంటిదని, మిథ్యాభూతమని, జ్ఞానవాశిష్టంలో శ్రీరామచంద్రునకు వశిష్ఠ మహాముని బోధిస్తాడు. స్వప్న, సంకల్ప, ధ్యాన నగరాలవలె నున్న ఈ జగత్తునకు దృష్టాంతాలు స్వప్న, సంకల్ప, ధ్యానకల్పిత నగరాదులేగాని తదితరములు కాదని శ్రీరామచంద్రునకు వశిష్ఠులు బోధిస్తారు. స్వప్నతుల్యమైన ప్రపంచం సర్వమూ మిథ్య కనుక, దాని మిథ్యాత్వ నిశ్చయమే పరమాత్మ సాక్షాత్కారము. అందే దృశ్యాలన్నీ మిథ్యగా విసర్జింపగా, సద్వస్తువైన పరమాత్మే శేషిస్తుంది. ఆ పరమాత్మే ఆకారశూన్యుడై అంతటా వ్యాపించి యున్నాడు. సర్వాంతర్యామియైన ఆ పరమాత్మ స్వరూపం, మన నిజస్వరూపంగా ప్రకటిత మవడం అన్ని సాధనాలకి అంతిమ గమ్యమని తెలుసుకోవాలి.

## (24)

త్వయి మయి చాన్యత్రైకో విష్ణు
ర్వ్యర్థం కుప్యసి మ య్యసిహిష్ణుః
సర్వస్మి న్నపి పశ్యాత్మానం ।
సర్వత్రోత్సృజ । భేదజ్ఞానమ్ ॥

**తాత్పర్యము :**

నీలో ఉన్నది, నాలో ఉన్నది, అందరిలోను అంతటా ఉన్నది ఒకటే పరమాత్మ. వ్యర్థంగా నన్ను చూసి అసూయపడుతున్నావు. కోపిస్తున్నావు. అన్నింటిలో సర్వాంతర్యామిగా ఉండే ఆత్మను గుర్తించుకో. భేద బుద్ధిని వదుల్చుకో.

వివరణ :

అజ్ఞానంవల్ల జనించిన నానాత్మ భావాన్ని జ్ఞానవికాసం వల్ల పోగొట్టుకొని, ఏకాత్మ భావాన్ని అలవరచుకోమని, పరమోత్కృష్టమైన అద్వైత తత్త్వాన్ని బోధిస్తున్నారు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే ఆధ్యాత్మిక సత్యాన్ని, అనుభవపూర్వకంగా తెలుసుకోమని చెప్పబడింది.

ఉన్నవాడు భగవంతుడొక్కడే అయినా, అనేకంగా గోచరిస్తున్నాడు. ఒక్కడై ఉండే భగవంతునిలో, అనేకత్వం ఎలా సంభవించిందో గమనించతగ్గ విషయం. ఈ విషయాన్ని శంకర భగవత్పాదులు అనేక ఉపమానాలతో వారి గ్రంథాల్లో వివరించారు. ఒకే మట్టితో చెయ్యబడిన కుండలు, మూకుళ్ళు, ప్రమిదెలు, కూజాలు మొదలైనవి, వేరు వేరు నామరూపాలతో ఎలా నానాత్వం పొందాయో, అలాగే సర్వేశ్వరుడైన భగవంతునిలో అనేక రకాల మనుష్యులు, జంతువులు, పక్షులు, క్రిమి కీటకాలు, చెట్లు మొదలైన సృష్టి జాతాలన్నీ ఉద్భవించి గోచరిస్తున్నాయి. అలాగే బంగారంతో తయారు కాబడ్డ గొలుసులు, ఉంగరాలు, కడియాలు, గాజులు మొదలైనవి, అనేక రకాలైన ఆభరణాలుగా వివిధ నామరూపాలతో ఉంటున్నాయి. స్వరూపంచేత అవన్నీ బంగారమే కాని వేరుకాదు. అజ్ఞానంవల్ల ఆ వస్తువులయందు బేధ బుద్ధి కలిగి, వాటిని వివిధ నామాలతో పిలుస్తున్నారు. బంగారం కంటె గాజులు, కడియాలు, ఉంగరం, గొలుసు వేరుకాదు గదా! ఆ వస్తువులు చేయకముందు అవి బంగారం, వాటిని కరిగించిన పిమ్మటను అవి బంగారమే. ఇక మధ్యకాలంలో అంటే ఆభరణరూపంలో మాత్రం అవి బంగారం కాక ఏమవుతాయి? కొంతకాలం అయిం తరువాత మట్టితో తయారైన వస్తువులన్నీ మళ్ళీ మట్టిగాను, బంగారంతో తయారుకాబడిన అభరణాలన్నీ బంగారంగాను తిరిగి అవుతాయి.

బంగారంతో తయారుకాబడ్డ సమస్త వస్తువులకు బంగారమే కారణం. వస్తువులు కార్యాలు. అలాగే మట్టితో తయారుకాబడిన కుండ, మూకుడు, ప్రమిద మొదలైన సకల వస్తువుల ఉత్పత్తికి మట్టియే కారణం. ఆ వస్తువులు మట్టియొక్క కార్యాలు. ఏది దాని కార్యమో, అది దానికంటె భిన్నం కాదని యదార్థంగా తెలుస్తున్నది. సర్వాంతర్యామియైన ఏకస్వరూపుడగు భగవంతుని యందు నామరూపాత్మకమైన ప్రపంచం ఉద్భవించి, మళ్ళీ భగవంతునిలోనే లయిస్తున్నది. ఈ జ్ఞానం కలుగుతే బేధబుద్ధి నశిస్తుంది. అందరిలో ఉండే ఒకే భగవత్ స్వరూపుని గుర్తించే తెలివి ఉద్భవిస్తుంది. ఈ తెలివియే అద్వైత జ్ఞానము. విచారణా, వివేకం లేకపోవడంవల్ల బేధభావం స్ఫురిస్తోంది కాని, అది యుక్తమైందీ సత్యమైందీ కాదు. ఈ బేధదృష్టి నశించాలంటే ఆత్మవిచారణ సాధన చెయ్యాలి. మనస్సును విషయాలమీంచి తప్పించి విషయశూన్యమైన ఆత్మవైపుకు త్రిప్పాలి. అంటే విషయ ప్రపంచం యొక్క మిథ్యాత్వాన్ని, నానాత్వాన్ని నిశ్చయించుకొని, దానినంతటి నుండి విముక్తి పొందాలి. ఇది సాధిస్తే, ఇక అద్వైత సద్వస్తువగు పరమాత్మయే శేషిస్తుంది. ఉన్నది ఆ పరమాత్మ ఒక్కటే కాని వేరేదీ లేదనే జ్ఞానోదయమే ఆత్మసామ్రాజ్యాన్ని పొందడం.

## (25)

శత్రౌ మిత్రే పుత్రే బంధౌ
మా కురు ! యత్నం విగ్రహసంధౌ
భవ సమచిత్తస్సర్వత్రత్వం
వాంఛ స్యచిరా ద్యది విష్ణుత్వమ్ ॥

**తాత్పర్యము :**

నీకు శత్రువైన వాడైనా, స్నేహితుడైన వాడైనా, పుత్రుడైనా, బంధువైనా- వీళ్ళెవరితోనూ విరోధం పెట్టుకోడానికి పూనుకోకు. నీ సాధన శీఘ్రంగా సఫలీకృతమై, నీవు దైవత్వాన్ని (విష్ణుత్వాన్ని) పొందాలంటే, అందరితో అంతటా సమచిత్తుడవై ఉండు.

**వివరణ :**

అందరి యెడల సమభావంతో ఉండటం, ఆధ్యాత్మిక సాధనాభివృద్ధికె. తో తోడ్పడుతుందని, సన్నిహితుల పట్ల విరోధభావం, శత్రుత్వ సాధనకి ప్రతిబంధకాలై అజ్ఞానంగా పరిణమిస్తాయని, ఈ శ్లోకంలో హెచ్చరిక చేయబడింది.

ఆధ్యాత్మిక జీవితం నిబంధనలతోకూడి వుంటుంది. అవి పాటించక పోతే సక్రమంగా సాధన కొనసాగదు. లేదా, చేస్తూన్న సాధన నిష్ఫలం అయిపోతుంది. సాధకుడు ముందుగా యమనియమాలను పాటిస్తూ, అష్టాంగయోగాన్ని అభ్యసిస్తేగాని ముందుకు పోలేడు. ఈ నియమాలన్నీ చిత్తశుద్ధికోసం ఉద్దేశింపబడ్డాయి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనే ఎనిమిది సాధన క్రియలను అష్టాంగయోగం అంటారు. ఇందులో మొదటిది యమము. యమమంటే, అహింస, సత్యము, ఆస్తేయము, బ్రహ్మచర్యము. అపరిగ్రహము. ఇందులో ప్రప్రథమమైనది అహింస. "అహింసా పరమోధర్మః" అనే సూక్తి అందరికీ తెలిసినదే. ఎవరికి ఎట్టి బాధ, హాని తనవల్ల కలుగకుండా ఉండే చిత్తవృత్తిని అలవరచుకోవడమే అహింసాచరణ. ఎవరితోను ఎలాంటి విరోధము పెట్టుకోక, ఎవరి యెడలా ఎలాంటి ద్వేషభావం

లేకుండా ఉండడం అలవరచుకోవాలి. ఇలాంటి చిత్తవృత్తివల్ల మనో-వ్యాకులత కలిగే పరిస్థితి ఉండదు మనస్సు ఎప్పుడూ ప్రశాంతంగా, సంతోషంగా ఉంటుంది.

మనం ఎల్లప్పుడూ సంపర్కం కలిగి ఉండేది దారాపుత్రాదులు. తరుచుగా మిత్రులతో కలవడం తటస్థ పడుతూంటుంది. ఇక బంధువులు మనకి అప్పుడప్పుడు తారసిల్లుతూ, మన జీవితంతో సంబంధం కలిగి ఉంటారు. వీరంతా మనకి సన్నిహితులు. వీరితో శతృత్వం వస్తే, క్లేశాలకి పాలవడం తప్పదు. మనః ప్రశాంతతతో హాయిగా, సంతోషంగా జీవితం సాగించడానికి వీలుపడక పోవచ్చు. ఆ శతృత్వానికి సంబంధించిన విషయాలు, తరుచుగా మనస్సులోకి వస్తూంటాయి. వాటిని గురించిన ఆలోచనలు విజృంభిస్తూంటాయి. సాధన సాఫీగా కొనసాగడానికి ఇవన్నీ అంతరాయాలుగా ఏర్పడుతూంటాయి. చిత్తం ప్రశాంతంగా ఉండటానికి అవరోధాలుగా తయారౌతాయి.

సర్వశతృత్వ భావాలకీ కారణం, రాగద్వేషాదులతో కూడిన మనోనిర్మాల్యం అని వివేకవంతులు గ్రహిస్తారు. ఈ మనోనిర్మాల్యం ఇంద్రియ నిగ్రహంవల్లా, వివేకంవల్లా నశిస్తుందని యోగవాశిష్టంలో ఎంతో వివరంగా బోధింపబడింది. మనస్సును ఆత్మవిచారంలో నిమగ్నం చేస్తే, మనోనిశ్చలత్వం, సర్వాత్మభావం ఉదయించి, నానాత్వ భ్రాంతి వదలిపోతుంది. సర్వం ఏకైక బ్రహ్మస్వరూపమే అని అవగాహన అవుతే, ఇక ద్వేషించే వాడెవడు? ద్వేషించేదెవరిని? ఈ అద్వైత సిద్ధాంతాన్ని ఆచరణలో పెడితే అన్ని మనోనిర్మాల్యాలు, ఇంద్రియ వికారాలు హరించి మనస్సుకు ప్రశాంతత, ఆనందం చేకూర్తాయి.

## (26)

**కామం క్రోధం లోభం మోహం**
**త్యక్త్వాత్మానం భావయ ! కోఽహమ్**
**ఆత్మజ్ఞానవిహీనా మూఢా**
**స్తే పచ్య న్తే నరకనిగూఢాః ॥**

**తాత్పర్యము :**

కామ, క్రోధ, లోభ, మోహాలని విడనాడి, నీవెవరో తెలుసుకునే ప్రయత్నం చెయ్యి. "నేనెవడను" అని విచారించుకొనుచూ, నేను ఆత్మస్వరూపుడనని భావన చేస్తూ, ధ్యానం చెయ్యి. ఆత్మజ్ఞానం పొందక, తానెవరో తెలిసికోని మూఢుడు, నిగూఢమై దుర్భరమైన నరకలోకంలో పడి యమబాధలకు గురి అవుతాడు.

**వివరణ :**

ఆత్మజ్ఞానం కలగాలంటే ముందుగా కామక్రోధాది మానసిక మాలిన్యాలన్నింటినీ వదుల్చుకోవాలి. అలా వాటిని విసర్జించి, ఆత్మజ్ఞానం పొందని మూఢుడు ఎటువంటి దుర్గతిని చెందుతాడో ఈ శ్లోకంలో వివరింపబడింది.

ఎంతటివాడైనా, ఆత్మజ్ఞానం పొందనివాడు మూఢుడే. జంతు సమానుడే. చదువులెన్ని చదివినా, ధనం ఎంత సంపాదించినా, పదవులెన్ని అలంకరించినా, ఎన్ని ఘనకార్యాలు, పేరుప్రతిష్ఠలు సంపాదించినా, తానెవరో తెలియని అజ్ఞానంతోనే జీవితమంతా గడిపివేసి, చివరికి అంతమైపోయేవాడు మూఢుడు కాక మరెవడు ?

ఇది ప్రతివారూ గమనిస్తూన్న విషయమే. ఎన్ని వున్నా, మనిషికి సంతోషమనేది లేక, చివరకి నిస్పృహతో జీవితమంతా నిస్సారమైపోయిన దని విచారిస్తాడు. ప్రపంచంలో గోచరించే అనిత్యమైనవేవీ మనిషికి ఆనం దానివ్వలేవని తెలుసుకున్నా, పురుష ప్రయత్నంచేసి భగవత్తత్త్వాన్ని తెలుసుకోడానికి ఎలాంటి ప్రయత్నం చెయ్యడు.

వెలుతురుండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్నట్లు, శరీరంలో శక్తి సామర్థ్యాలున్నప్పుడే ఆధ్యాత్మిక సాధనలు చేసి, తానెవరో, పంచభూతా త్మకమైన ఈ ప్రపంచం ఏమిటో, తెలుసుకోడానికి ప్రయత్నం చేసు కోవడమే మానవ జన్మనికి ముఖ్య కర్తవ్యం. కాని వృద్ధాప్యం ప్రవే శించి, శరీరం శిధిలావస్థలో కొచ్చిన పిమ్మట, ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఎన్ని సిరిసంపదలున్నా, ఎన్ని సౌఖ్యాలు కలిగియున్నా, జ్ఞానం లేని వృద్ధుడు గాడిదకంటె హీనమైనవాడని చెప్పబడింది. ఆత్మజ్ఞులు కాని మనుష్యులను ఉపనిషత్తులు, శ్రుతులు పశువులని వర్ణించాయి. అయితే, వారు అంతకన్నా కూడా హీనులు కావచ్చునని భగవాన్ రమణమహర్షి బోధలలో గమనించగలం.

అన్ని ఆధ్యాత్మిక సాధనలకీ అంతిమ లక్ష్యం ఆత్మానుభూతిని పొందడం. సర్వాతీతమైన సచ్చిదానందమనే ఆ అనుభూతిని పొందడా నికి ఎంతో పురుష ప్రయత్నం అవసరం. దానికి ఎన్నో అవరోధాలు చుట్టిముట్టి ఉన్నాయి. అన్ని అవరోధాలకంటే ముఖ్యమైనవి, దుర్దమ మైనవి నాలుగున్నాయి: అవే కామ, క్రోధ, లోభ మోహాలు. తరువాత ఇంకో రెండు- మద, మాత్సర్యాలు కూడా వున్నాయి. వీటిని అరిషడ్వ ర్గాలు అంటారు. వీటిని ముందు సాధకుడు వదుల్చుకోవాలి ఇవన్నీ మానవుని మనస్సుకు పట్టిన అజ్ఞానపు మాలిన్యాలు. ఈ మాలిన్యాల వల్ల, మనస్సు వికృతరూపం ధరిస్తుంది. చంచలత్వం పొందుతుంది దురహం

కారియై దుఃఖాల పాలౌతుంది. ఇలాంటి నిలకడలేని మనస్సుతో మనుగడ సాగిస్తూ, జనన మరణ చక్రకంలో మనిషి తిరిగిపోతూంటాడు. ఇలా జీవితాలని వృధాచేసే మూఢ మానవుల్ని హెచ్చరిస్తూ సంస్కరించి, సాధన మార్గంలో ప్రవేశపెట్టే ఉద్దేశంతో ఈ శ్లోకం ప్రసాదించబడింది.

## (27)

గేయం గీతా నామసహస్రం
ధ్యేయం శ్రీపతిరూప మజస్రమ్
నేయం సజ్జనసంగే చిత్తం
దేయం దీనజనాయ చ విత్తమ్ ॥

**తాత్పర్యము :**

భగవద్గీత వెయ్యిసార్లు పఠనం చేస్తూ గానం చెయ్యవచ్చును. శ్రీపతియైన మహావిష్ణువు యొక్క రూపము సతతము ధ్యానించవచ్చును చిత్తాన్ని సజ్జనుల సాంగత్యంలో ఉంచవగును. బీదలకు, దీనులకు ధనసహాయం చెయ్యవగును.

**వివరణ :**

సన్మార్గంలో ఆధ్యాత్మిక జీవితం గడపడానికి, వివిధ మార్గాలను రుతులను, మహాత్ములు సూచిస్తూంటారు. ఎవరికి ఏది సరిపడితే, వారు దానిని ఆచరిస్తూ లక్ష్యాన్ని పొందవచ్చునని వారి ఆదేశం. ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులు నాలుగు సాధనా మార్గాలను సాధకులకు సూచించారు. కొన్ని సాధనలు, సత్కర్మలు ఇలా ఉదాహరణకు ఇచ్చారన

కోవాలి. ఇలాంటివి సామాన్య మానవాళికి ఉద్దేశింపబడతాయి. ఇలా ఉద హరించబడ్డ సత్కర్మలు, సాధనలు చెయ్యడంవల్ల, మనోమాలిన్యాలు నశిస్తాయి. చిత్తశుద్ధి కలుగుతుంది. జీవితం ఎంతో ప్రశాంతగా సాగుతుంది. యదార్థమైన భగవతత్త్వాన్ని అవగహన చేసుకోడానికి అవకాశం కలుగుతుంది. మనిషికి దాపరించిన అన్ని అరిష్టాలకీ, దుఃఖాలకి మనస్సే కారణం. ఆ మనస్సుని సరియైన రీతిలో పెట్టడానికే ఈ సాధనలు, సత్కర్మలు ఉద్దేశింపబడ్డాయి. చిత్తశుద్ధి లేకపోతే ఆధ్యాత్మిక జీవితం ముందుకు సాగదు. అందుకే యోగ వాశిష్టంలో ఇలా చెప్పబడింది:

సవర్ణం నస్థితిం యాతి మలవత్యం శుకే యథా।
ఏకాదృష్టిః స్థితిం యాతి నమ్లానే చిత్తకే తథా॥

అంటే, వస్త్రం పరిశుభ్రంగా లేక మలినంగా ఉంటే దానికివేసే రంగు ఎలా నిలవదో, అలాగే చిత్తం మలిన భావాలతో ఉంటే, అద్వైత ఆత్మతత్త్వ జ్ఞానం స్థిరత్వంగా ఉండదు. (స్థితి ప్రకరణం - 128)

## (28)

ముఖతః క్రియతే రామాభోగః
పశ్చాద్ధన్త! శరీరే రోగః
యద్యపి లోకే మరణం శరణం
తదపి న ముంచతి పాపాచరణమ్ ॥

తాత్పర్యము :

సుఖం కోసం సునాయాసంగా స్త్రీ సంభోగం చేస్తారు. కాని, దుర్భరం! తరువాత శరీరంలో రోగం

ప్రవేశించి, దుఃఖావమానాలకు పాలౌతారు. అలాంటి వాళ్ళకు ఈ లోకంలో మరణమే శరణ్యం. అయినా పాపాలు చెయ్యటం ఎంతమాత్రం మానరు.

**వివరణ :**

విషయ భోగాల్లో సుఖం ఉందని, వాటికోసం ఎంతో తాపత్రయ పడిపోతారు. కాని అవన్నీ దుఃఖానికీ, రోగాలకి దారితీస్తాయి. సుఖమనేదేదీ దానంతటఅది మనకి ప్రాప్తిస్తుందా? కొంచం ఆలోచించి చూస్తే ఈ లోకంలో అలాంటి సుఖం ఏదీలేదు. విషయ సుఖాలన్నీ అంతేకదా! విషయ సుఖంకోసం, ఆ విషయం మీదో, లేదా ఆ సుఖాన్ని పొందడానికి ఇంకొక వ్యక్తిమీదో ఆధారపడి పోవాలి కదా! ఆ విషయం కాని ఆ వ్యక్తి కాని సరిగ్గా లేకపోయినా, లేదా వాటిని సమకూర్చుకోడంలో ఏదైనా మోసం జరిగినా, సుఖానికి బదులు దుఃఖమే సంప్రాప్తం అవుతుంది. ఇలా విషయ సుఖాలకోసం ఎగబడిపోతూ తాపత్రయపడే వారిలో అధికంగా దుఃఖాలకి గురియై మనస్తాపాలతో క్రుంగిపోతూంటారు. స్త్రీ సంభోగంవల్లా, ఇంద్రియ సుఖాలవల్లా సంక్రమించే అనర్థాల్ని, సాధకులను హెచ్చరిస్తూ ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులు చెప్పారు. విషయ భోగాలన్నీ దుఃఖభూయిష్టాలనీ, వాటిని విడిచిపెట్టి సన్మార్గంలో ఆధ్యాత్మిక జీవితం గడపాలని ఈ శ్లోకం యొక్క అంతరార్థం.

## (29)

అర్థ మనర్థం భావయ నిత్యం
నాస్తితత స్సుఖలేశ స్సత్యమ్
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః ॥

**తాత్పర్యము :**

ధనం ఎల్లప్పుడూ అనర్థదాయకమైనదని భావింపుము. దానివల్ల యదార్థంగా ఎలాంటి సుఖమూలేదు. డబ్బున్న వాడికి కన్నకుమారునివల్ల కూడా భయం సంక్రమిస్తుంది. సర్వకాల సర్వావస్థల్లోను అన్నిచోట్లా ఈ మాదిరిగా జరుగుతూనే ఉన్నది.

**వివరణ :**

కనీస అవసరాలకు ధనం ఎంతవరకూ అవసరమో అంతవరకు దానివల్ల ఇబ్బంది కలగదు కాని, ధన సంపాదననే ధ్యేయంగా భావిస్తూ, అవసరాలకు మించిన ధనాన్ని కూడగడితే, దానివల్ల కలిగే అనర్థాలు అపరిమితంగా ఉంటాయి. డబ్బుగల వాళ్ళనుచూసి సంఘంలో అందరూ అసూయపడటం, ద్వేషించడం తథ్యం. సంఘ విద్రోహులకళ్ళు ధనవంతుల ఇండ్లమీదే ఉంటాయి. సంపాదించిన ధనాన్ని, డబ్బుతో కొని సేకరించిన విషయవస్తువులను, ఎవరూ తస్కరించకుండా కాపాడుకునే ఆలోచనల్తో, మనస్సు ఎప్పుడూ నిలకడలేక అశాంతితో ఉంటుంది.

ఇక స్వగృహంలో ధనవంతుడికి ఎన్నో సమస్యలు, ఆందోళనలు, భయాలు. బంధువులవల్ల అసూయాద్వేషాల పాలౌతాడు. కొడుకులు పెద్ద వాళ్ళవుతోంటే, వాళ్ళదృష్టి ఆ డబ్బుమీదనే ఉంటుంది. అది తమకి ఎప్పుడు కైంకర్యం అవుతుందా అని ఎదురు చూస్తూంటారు. ఇలా సామాన్యంగా ధనవంతులైన సంసార్లుపడే ఇక్కట్లను, సాధకులకు హెచ్చరిస్తూ, శంకర భాగవత్పాదులు ఈ శ్లోకంలో వివరించారు.

ధన వ్యామోహం గలవాడు, ఆధ్యాత్మిక జీవితానికి అర్హుడేకాడు. అటువంటివాడు ఎన్ని సాధనలు చేసినా, ఓటుకుండలో పోసే నీళ్ళలా, నిష్ప్రయోజనమే అయిపోతాయి. ధనం దానంతట అది ప్రాప్తిస్తే, దాన్ని

